

ఉదారమూర్తులు, పరశ్రేయస్కాములు, సుప్రసిద్ధ జాతీయవాదులు

నగు

**శ్రీయుత గుంటుపల్లి సూర్యనారాయణచౌదరిగారికి**

గౌరవభావపురస్సరముగ నా యీ రచనలు

**ఆంకితం**

—శ్రీహరిరావు

# అంజలి

నా యీ పుస్తక ప్రచురణకు సర్వవిధాలా తోడ్పడిన
శ్రీయుత ఎ. యల్. నారాయణగారికి

నాకు భాషాపటిమలో గురువులయిన
శ్రీయుత చాపరాల సత్యనారాయణరావు
B. A., B. Ed. (Eng. Litt.) గారికి

నా కపూర్వ సలహాలిచ్చి ప్రోత్సహించిన
నా మిత్రులకు

**హృదయపూర్వక కృతజ్ఞతాంజలి**

—"శ్రీహరి"



## ర చ యి త

జననం — 1925

జరిగిన తన కొద్దిజీవితంలోనే యీయన అనుభవించని సుఖదుఃఖాలు లేవు.

అసూయ, జుగుప్స, పరపీడన, అతిస్వార్థవిలాసులయినప్పటికీ సంఘంలో పెద్దలుగా చెలామణీ అవుతున్నవారిని తీవ్రంగా ముఖాముఖి విమర్శించుచుండుటవలన — యీయన జీవితం ఒకేవిధంగా నడవటానికి వీలులేకుండా చేయబడుతూంది. నైతికంగా విజయం ప్రతీవిషయంలో యీయనదే, ఎంతటి ఆఘాతుకాలనైనా చిరునవ్వుతో చురుకుదనంతో ఎదుర్కోగల మానిసి.

# సందేశం

జీవిత నాటకరంగపు, గడచిన బహుదృశ్యాల్లో
రంగుల తళుకుల బెళుకుల కపటవేషధారుల్లో
నలిగిన లఘుజీవాలివి!

భూనభోంతరాళాల్లో పిక్కటిలిన
రక్తాక్త కృపాణాల
గెలిచిన సైన్యాల జయధ్వానాల
వందిమాగధుల బానిసగానాల
మంద్రమేఘ ఘోషల్లో
అణగారిన అనాథజీవుల
అరణ్యరోదనలివి!

పుక్కిటి పురాణాల, కట్టుకథల
దట్టంపు అరణ్యాల్లో
కనుపించని వనపుష్పాలివి!

రారాజుల, నరహంతక, పరపీడక
నిరంకుశ కలంక చరిత్రల
కలుష పాపపంకిల పుటల్లో
కనుపించని, వినుపించని, మరుగుపడిన మహాత్ముల
క్షుద్రమానవుల జీవిత పోరాటపు
భగ్నపరాజయ గాథలు!

ఆకసమంటే కోటల నిర్మించిన ఎముకగూళ్ళ
మూక కంఠసమూహాల అశ్రుత ఘోషలు,
పుత్రుల గోల్పోయిన మాతల, అనాథశిశువుల;
సద్యోవిధవల లోలోపల దిగమింగిన
యింకిన అశ్రుమహానదాలు
కళాప్రియుల రాజ్యాల్లో కాటకాలు
కాలువకట్టిన పాటక, జనసామాన్యపు చెమటలు
ఊసరక్షేత్రాలను తడిపిన
విలువలేని నరరక్తపు సాగరాలు
మా తెచ్చిన సందేశం!!

పండిన పచ్చటి పైరుల
బంగరురంగుల ఒరిగిన చేలపైన
యోద్ధల గుర్రపుడెక్కల ధ్వంసలీల
సామ్రాట్టుల మదమత్తకరీంద్రాల
స్వేచ్ఛా విహరణ!
సామ్రాట్టుల సంకేతంపై
వర్షాపాతపు నదులై ప్రవహించిన
మహాసైన్యవాహినిలో
కొట్టుకుపోయిన జనపదాలు
—ఏమిటి యీచరిత్ర?
హత్యలు దోపిళ్ళుతప్ప!

లెండి. లెండి—
దారి తొలగిపొండిక

ప్రాపంచిక సౌఖ్యాలకు
మెరిసే బంగరు నాణ్యాలకు
మానవ మేధస్సును విక్రయించి
తమ హృదయపు సత్తువని నమ్మిన
మిథ్యాచరిత్రకారులూ—!
రాజసభల కవికుమారులూ—!!
వినుడి! మా తెచ్చిన సందేశం!!!

మా వెలిగించిన జ్యోతులు—
జన రక్త తైల దీపితమౌ
ప్రభువిలాస నృత్యోత్సవ
ప్రమత్త దీపికలు కావు;
సంస్కృతి బలిపీఠంపై
ఆత్మోత్సర్గపు ప్రదీపమాలికలై వెలిగిన
మేధావుల జీవితాల
ఎర్రని ఒంటరి జ్యోతులు—,
చరిత్ర చీకటి గుహల—
ఆశానిగూఢ వక్షస్సులు;
భవిష్యద్యుగ యాత్రికులకు—
నవ్యపథ ప్రదర్శక జ్యోతులు!!!

—A. B. C.

# పిరదౌసి

స్థలం:—తూసు గ్రామమున ఒక జీర్ణకుటీరము.

[పిరదౌసి:—మూర్తీభవించిన నిరుపేదకవి. చినిగిన దుస్తులలో తోలుగప్పిన అస్థిపంజరం. జర, మృత్యువు; నిరాశ నివురుగప్పిన ప్రతీక్ష ద్యోతక మయ్యేవ్యక్తి, నేలనానే కుక్కిమంచంలో ముక్కుతూంటాడు. ప్రక్కనున్న ఆముదపుదీపం కునుకుతూంటుంది.

మోతి —తొంగిచూచే యౌవనాన్ని కప్పలేని చినుగుదుస్తులు పదునాల్గేండ్ల యువతి నిరాశ నేదో ఆశ జయిస్తూన్న గంభీరమైన భంగిమ ]

* * * *

పిరదౌసి:— (పొడిదగ్గు - మూల్గులు) అబ్బ ! మోతీ!... బేటీ... రాత్రులు నిగుడలేక పగలల్లా నా అంతరించబోయే జీవితానికి వెలుగును కలుగ జేయ ప్రయత్నిస్తూ నీవుకూడా ఎందుకలా శరీరాన్ని శల్యంచేసు కుంటావ్ చెప్పు ? ఇక బ్రతికినంతకాలం నేనెలాగో బ్రతకలేను... బ్రతుకదలచలేను.... ముష్కర మామూదుచెయిదమున నిన్ని నిస్స హాయ జీవితపు ఎడారిలో ఒంటరి నికృష్టపు ఒంటెపలె విధికి వదలివేసి కేవలంగా నిర్నిమిత్తంగా నే మృత్యుగహ్వరంలోనికి పోవలసిందే .. అబ్బ.....ఊ......బాధ......యమయాతన... అ హ్హా హ్హా.

మోతి:—బాబా! ఎందుకలా ఆయాసపడేట్లు ఆవేశపడతావ్ ? విధికి నన్ను వదలేసి నిశ్చింతగా ఉండకూడదూ ? ...నాకు జరుగనున్నది జరు గక మానదు. అనువిశ్రాంతి ప్రశాంతతలతో మీ యీదశ గడుపవలె గాని, అనవసరంగా చర్విత చర్వణంగా క్రోధావేశాలపాలు గావడం మంచిదికాదు. కొంచెం విశ్రాంతిగా నిశ్చింతగా పడుండండి దాదా!! వైద్యుడు కక్కాయికూడా నిశ్చింతతోటి విశ్రాంతి మీకత్యంతా వశ్యక మన్నాడు.

పిరదౌసి:—నిశ్చింత!...విశ్రాంతి??......భ్రమ ! నాజీవితమునకిక అవి తలచలేని మాటలు, వ్యవస్థలు,...తలపమించని తలపులతో జీవించిన

మూటగట్టుకుని, దివ్యప్రభగా వెలుగవలసిన ఆతనినామకీర్తి కిస్వయంగా నలుపు కరడుకుంచెతో తమోమయం చేసుకున్నాడు. ప్రజ ఆతని నేడు చాటున, రేపు, బహిరంగంగా గర్హిస్తుంది. ఆతని కాలికే విధించుకున్న ఆశిక్షచాలును. మీరావేశమున సామాన్య మానవులవలె ఆతని దూరుటకన్న క్షమాదృష్టితో మిన్నకుండి మిగిలిన జీవితమును కవి నను గర్వముతో గడపుటకన్న విశాలత మరొకటిలేదు. ఇక శాంతించుడు ... .....కొంచెం నిద్రించరూ!

పిరదౌసి:—అరె పగ్లీ...... .. ఇంకెక్కడి నిదుర......సౌఖ్య జీవితాన్ని కలలుకంటూ నాడుకాలంతో పోటీపడుతూ ఆ అమరపద్యావళికోసం నిదుర నేమరిచాను చివరికి నాకావ్యకన్నియను సర్వాంగసుందరముగ అలంకరించి ఆ మామూదు సామ్రాట్టునకు కట్టబెట్టి సింగారముగ గులాబి సౌరభాలతో నాడు సభాస్థలికి గొంపోయి, చిరుతెర మాటున నున్న నాబిడ్డని ఆతని సమక్షాన మాధుర్యమును సడలించి ఆతని అంకసీమ నధిష్ఠించిన పిదప హాయిగ నిదురింతమనుకొంటిని... కాని,...కాని, నాటి నా సుగుణ పుంజపు కావ్యపుత్రికతో పాటు... నా నిద్రను కూడ దొంగిలించె నానపుంసకుడు...మిగిలిన నిద్రాదేవిని నాడు రాజ్యమునుండి బహిష్కరింపబడి పనికూనవను నీతో నిష్క్రమించునపుడు నగరు శివారు మసీదుపై నా యుల్లేఖిత లేఖకు పహారా హుషార్ను చేసి వచ్చాను...నిదుర?...దేనికో! అహ్హ హ్హ!! బుద్బుదాలైన మానవ జీవితాలలో కోర్కెలీడేర్చుకొనలేక, ప్రతీకార వాంఛా శూన్యులై నిద్రమత్తుతో కునికేహీనుల నేమనాలి? ... బేటీ, నీ వెరుగవు... నీ వప్పటికి పుట్టలేదు. నీ మాత ఇంకా దేహి కాలేదు ...ఎన్ని ఆఘాతాలోర్చి, ఎన్ని నష్టకష్టాలకు లోనయి మీ అక్క షహనానూను పోషించానో నీ వెరుగవు...దానికి ప్రతి ఫలం మృగ్యమని తెలుసుకుని అనుభవిస్తూన్న నా హృదయంలో ఎన్ని అగ్నిపర్వతములు పెల్లుబికి బ్రద్దలయి యీ గజనవీ సామ్రాజ్యమూ, వంశవృక్షాల పైకి లావాను వెదజల్లుతున్నవో నీ వెరుగవు...అహ్హ హ్హ! అబ్బ! ఏం బాధ!!

మోతి:—సుస్మిత శాంతి సహనతల నాపాదించుకుని పూర్వాపర స్వవితర్కవై స్వోత్కర్ష లేక మీరు జీవితము సాగించుటను బహుల యిట్లు కుములుట భీరులు చేయవలసిన పని. మీ కిది తగనిది మీ కీర్తి కిది యొక్క మేఘచ్ఛటు. మీ నిష్కళంక అమరకవితా జ్యోతిలో మసి కొండిని సృష్టించ మీరే ప్రయత్నించుట వెంగలితనమని గ్రహింపరా ? . ఆ మామూదుపై క్రోధముతో స్వాఘాతుకులయి కీర్తిసోపానములనుండి ఒక్కొక్కటిగ తిరోగమింతురా ?—ఛా ! నా మాటను విచక్షణా దృష్టితో చూడరూ...నా కొరకై.

పిరదౌసి;—నీకొరకుగాక, నా జీవన్నాటక పాత్ర భాగము ముగియనున్న నా కొరకా నాతాపత్రయము. నన్ను గురించి నేనెన్నడూ ఆలోచించి యుండలేదు. నా స్వేదంతో, మజ్జతో తరతరాలుగా నావంశ వృక్షానికి అమృతం పోయదలచియే నేపాటుపడ్డాను. నా ... యే నాదృష్టి సారింపబడినయెడల ఆశత్సిత మామూదు చూపెన తెలివెండి నిష్కములతో డనే పూర్తిగ తృప్తిపడి వాడనుగదా ? !...నీకు తెలియదంటి నే......పాలబుగ్గలు మోహనలనైన యౌవని నీకు లోకానుభవమున ప్రవేశమెక్కుడుగ నుండుట కవకాశ మేది? ఉన్నకొలది అవకాశమును జరామృత్యు మహావేశములతో నే నేమూరగొంటినిగదా...

మోతి:—మీ రేమియు విచారించ పనిలేదు. నా కొరకనిగదా నే మిమ్ము కోరునది...

పిరదౌసి:—నీయవ్వన ప్రథమ గులాబీలకై కనీసపు రక్షక పత్రములనైన సృష్టింపలేని నన్ను నీవేదో అర్థించుకుంటివే...పిచ్చిపిల్లా ...నీవెరుగవు...అనుకూల జామాతయై సుఖపెట్టగలడన్న ఆ మామూదు మాత్రమే నన్నొకసారి అర్థించాడు. కొట్టువిలాపములతో ప్రాంగేయ పడినాడు. అపూర్వ మనోజ్ఞా ఖ్యాయముకై ప్రాణములనైన యిత్తునని నాడు...శిలాతామ్రశాసనముల మాత్రము మిగిలి కాలపు రాసి డుల నేల గలుపవలసిన ఆతని వంశమునే అమర స్వర్గాధిపుల జేయు పుత్తడి రత్నమణిమయ ఖచిత సింహాసనాల సృష్టించితిని. కాని కృతఘ్నుడైన ఆ లోభ ఘాతుక చక్రవర్తినే సకాలములో గుర్తింప

లేదు...ఆతని మేడిపండు వాటమును సకాలమున గుర్తించి ఆతని కోరికను నెట్టివేసినచో...నా మధుకణ అమరకవితా స్రవంతి క్రింద పులకై ప్రపంచమే చేయెత్తి ఆర్ధించి మంగళాక్షతల చల్లి తృప్తి జెంది కృతజ్ఞతతో నన్ను సరిగగుర్తించి తమ మూర్ధమున మోసెడిని. కవన కన్యకాసృష్టిలో మజ్జను కేంద్రీకరించి అనుంగు భార్య కష్ట సుఖముల సరకు గొనక దుర్భర మానావమాన దారిద్ర్యము పాల్జేసి కృశింపకుండ కాపాడుకొని మూడుపువ్వులారుకాయలుగా జీవితము గడిపి యుండెడి వాడనే...ముక్కుపచ్చలారని నా మొదటి బిడ్డను -ఆకావ్య కన్నియపై కేంద్రీకరించిన ఏకాగ్రతలో శతాంశము సరకు గొన్నను-బ్రదికించుకొని సుఖమయ జీవితమును గడిపియుండెడివాడనే కనీస మామూడేడుల పసిబిడ్డ నిర్దిష్టముకాని అశ్రద్ధకులోనయి బ్రదికించుకొనలేని నా అత్యంతివ్యపు గడ్డితనాన్ని గుర్తించినా, పచ్చి బాలెంతయగు నా యర్ధాంగిని బ్రదికించుకొని యుండెడివాడనే... కాని దూరదృష్టిలేకయె దూరదృష్టి గల పదార్థ చింతకుడనను భ్రమతో ఆ అమరకావ్య కన్నియను సృష్టించుట వలననే నే నీయమ ప్రత్యక్ష నరకము బారబడి నా వంశాంకురమవగు నీకు నిలువ నీడ లేకుండ చేసుకున్న వ్యర్థ జీవిని కావలసి వచ్చినది...ఏమి లాభము... ఏ యుపశాంతియు నాలావా నారికట్టి అగ్నిపర్వతము నాపలేదు.

మోతి:—బాబా! అంత అమరకావ్యకన్నియను సృష్టించిన మీ కీర్తి దిగ్దిగంతముల సూర్యచంద్రాదులు నిలుచునంత కాలము అప్రతిమాన భాసురముగ వెలుగొందగలదు. మీ కాకీరితిచాలు. శాశ్వత కీర్తి కాయులయి చిరకాలము మనగలవు మీ నామాక్షరములు...మీ కీర్తి జ్యోతుల వెలుగున నా జీవితము సుఖమయ వెన్నెల పథాల రోజా తోటల నిష్కంటకముగ గడువగలదు. మీ భిక్షునాకూ, ప్రపంచానికీ మరువరానిది! అపూర్వము! మనోహరశాశ్వత ప్రపంచ కావ్యముద్దియ!!...మీ రీవిషయమున వితర్కించి హాయి నిదురించి నన్నానందింప జేయప్రార్థన.

పిరదౌసి:—కీర్తి నసబ్బాటమముబోంట్ల చేతగాని పని. అమరకావ్యముల సృష్టికి సిద్ధహస్తులము మేము. తలచినంత కావ్యకన్నియకు గజ్జెలు కట్టించి,

నవరసభరితముగ శాశ్వత సంగీతానంద నృత్యముల చేయించగలము. సామాన్యులవలె కీర్తితో తృప్తిపడువాడు కాడీ పింగాణి. అదియ నా ప్రత్యేకత...కాతురుల కీర్తి కై వారముల కుబ్బుట కాని కాలపు కుకవి కాతురుల కని మా తలంపు. క్షుద్రాగ్రుడు మృగతృష్ణలతో కడుపు నింపుకొనదలచు వెఱ్ఱి—కీర్తి కుబ్బుట యని మా తలపు ..నా ప్రత్యేకతను గ్రహించి తగు ప్రతి ఫలమీయ గల సరసుడగునని నా ముద్రియ నర్పించుకున్న ఆ నపుంసకుడు కృతఘ్నుడై సమాదరింపనపుడు—నా అక్షర లక్షల బంగరు నిమ్మ—ములనీడను. నా కావ్యముద్రియను సృష్టించిన శ్రమ ఫలితము తెలివెండి యున్నప్పుడదిమహద్భాగ్యమని తీసికొనుట లోభత్వము ... పింగాణి అట్టి నీచమునకు పాల్పడడు — నాముద్రను వేపించి, ప్రతిఅంగము ఛిన్నాభిన్నమా మాలేఖినీ శూలపు పోట్లను తూట్లుచేసి ఆనందించుటయ నాకిక మిగిలిన ఆనంద పరిణావధి. — నన్నాపకు ... ... ... ఉన్నా జీవితమున నావిధిని మగటిమితో నిగ్రహించుకొని మననీయ్ ... విడు ... ఏయ్ స్వానలక్షణ శోభిత ముద్రియ నాదరింపలేని మాయూనా నపుంసకా నిలువు ! ... నీమొగాన తన్ని నాలేఖినితో నీకనులు చిల్లులుచేసి, ప్లాస్మాస్రవించుచుండ నాలేఖిని తడిపి నీగుండియలపై నాపటిమా ప్రతీకాక్షము రుచి మాపెదనాగు....ఏలఅంత భీరువుగా బ్రదుకుట— జీవచ్ఛవమా... నాగ్రోల కాలూనక పారిపో భీరుడా— నిలునిలు—. ఆ...అబ్బ.. పారిపోయివాడు—బాగు—కాని—నాలేఖిని అడ్డుదవిలి ఆతని బోరగిల ద్రోసినది...అతని ఎడదనెమ్మొముల నుండి -కాదు కాదు, రాతి హృదయమునుండి రక్తము నా పాదరక్షలనైపు చిందించు చున్నది. ..కాని, కాని—నేక్షమింపను...క్షమార్హము కాదాతని తప్పిదము — ఊ—క్షమ కన గ్లానదవు ..చావు...దుర్భగ చిత్రవధాయాతనలో మరణించు...ఛీ మూర్ఖ, కృతఘ్నా...నపుంసకా!!— ఆ — ఆ...బాధ...దాహము...పుడిసెడు నీరు... యీ...అతుల—సంకుల...సమర ఆవేశ...శ్రమా సింహానికి... అనుతాప లేపము...దాహము.

మోతి:—విశాలదృష్టి వెనుకంజ వేసిన ఆవెంగలి మామూదు నాటినుండియు స్వోత్కర్షలకు భత్రాజులకు లోబడిన లోభమనః ప్రవృత్తిగల గజనవీ సామ్రాట్టు యిప్పట్టున తన తప్పిదమునకు తప్పక పశ్చాత్తప్తుడయి యుండును ...తన కృతఘ్నత తెలిసికొన్న వితర్క గజనవీ మామూదు మహా పశ్చాత్తాపముతో ఎన్నో అగ్నిపర్వతములు తన హృదయమున పెట్లున ట్రద్దలు చేసికొని, కమిలి ఆ భత్రాజుల పొగడ్తల మూలముగ నయాగరాలో ముక్కిడి కఱకు రాలపై తన నామాక్షరములమాలా జీవితము త్రోయబడి నటుల గ్రహించి పెట్టున ఏడ్వకమానడు...అపూర్వ పశ్చాత్తప్తమగు ఆతని హృదయము కన్నీట కలిగిన కలధౌత వస్త్రమై—తన ధనాగార మొత్తమేగాక, హృదీరక్త కుంకుమతో మీపాదాభిషేకము చేయ త్వరపడ వచ్చును. ఇది తప్పక సున్నిత భావుకుడగు మామూదు చేయగల తనుపని ..ఊరడిల్లుము...శాశ్వతకీర్తినుత రసికవి అని పించుకొనుము బాబా... యీఊచబియ్యాపుతే నేఓడ్పునుకొంచెము మ్రింగుము...ఊ! అదిమంచిది!!...నాకిక మనశ్శాంతి చేకూర్తురను కుందును...

పిరదౌసి:—ఊ......తృప్తి......ఆనపుంసక మొరటు ముష్కర మానిసి మామూదు పశ్చాత్తాపమనునది యెరుగడు. వాడు తెలిసియు వికటాట్టహాసముచేయు బధిరాంధకార గ్రీష్మ ..ఒకవేళ నాలేఖిని పోటుల కవిసి క్షమార్థియై మనకు ఆయరువదివేల బంగారు నిష్కము లంపినను...వాటిని ముట్టక క్షమ నాతనికి దక్కనీయక...నీవు నుడువుచున్నటుల నా పేరు శాటువనే సుఖముగనైనను...లేక బికారినై నావంశ రక్త మహిమను ద్యోతకముచేయుదువని ఆశించు చున్నాను ...ఇది నా తుదికోరిక...అట్లకాదు....సుఖజీవితాశలో ఆతని పశ్చాత్తప్త కానుకల స్పృశించినచో...అది...నారక్త మాంసాదుల భుజించి నటులేసుమా...ఏదీ...నీ నిష్కళంక అభయము ?

మోతి:—దాదా!...నీ ఆత్మతృప్తికన్న నాకేమికావలయును,...అటులే క్షమింపక ఆతని నెట్టివేయుదును...ఇది నా హస్తము ..హృదయ పూర్వక అభయము.

పిరదౌసి:—అబ్బ! నేటికి నాఆత్మ ప్రతిబింబమవగు నీనుండి తృప్తినొంది తిని—ఇక నాకు... తృప్తి... అబ్బ... ఊఁ—శాంతి... మోతీ... . శలవ్.

[మినుకు మినుకుమను దీపిక పూర్తిగా సమాప్తి]

మోతి:—దాదూ,...ఆ ..నన్నే కాకిని జేసి నీవు శాశ్వతకీర్తితో కనుమూసి తివా...ఇంకెక్కడి దాదూ ..సింహద్వారమున ఆ అమరయుగ కవి హృదయ జ్యోతి అంతరించినది....ఏమది...ఏసొమ్ములని? ...

భటులు—(ప్రవేశం) [సింహగజ పదకుసుగాములతో] షాఅలం మామూదు గజనవీ వడ్డీతో సహా పంపిన మీబంగరు నిష్కములు...పిరదౌసి అమరయుగ కవీ జోహారు!!

మోతి:—ఛీ ..వామ ద్వారమున యీరక్త మాంసాదుల నేల గెచ్చితిరి ముష్కరులారా! ..పొండు ఆ—బేసరసుడు మామూదు హృదయ రక్తమునైన మాబాబా ఆత్మ శాంతికి పణములుగా తేలేదేమి... పొండిక ..నికృష్టపు మీమొగములు చూచిననే రౌరవ నరకము తప్పని సరి.

[తెర త్వరగ]

(ఇది 1944 ఉగాది సూర్యప్రభ సంచికలో "తృష్ణ" యను పేర ప్రకటింప బడినది. కాని నాకు కాపీ పంపలేనుబాధ్యతగలవ్యక్తులు. నేనెన్ని సారులు కోరినను వేరొక కాపీ నైనను V. P గా నైనను పంపియుండ లేదు ...కాపీనైన వ్రాయించి పంపకోరినను ఎవరూ వినలేదు, పంపిన స్టాంపులు మరొక దానికి వాడుకుని యుందురువారు..., నేనా పత్రికకు సంపాదకుడుగా పనిచేసినప్పుడైనను దాని కాపీని తీసుకొను వ్యవధి నాకీయ లేదు, —ఏమైన అభావముల విశాలము చేసి ప్రకృతమిది రచించితిని.... సర్వం మన మేలుకే, సెలవ్.)

—♦—

# బైరాంఖాన్

(ప్రారంభము — (రేడియోనాటిక)

భటుడు: — సలామాలేకుం, అక్బర్ పాదుషాహ్ !... మహామంత్రి సర్వసేనాని యగు బైరాంఖాన్ జీ తమ దర్శనము వేచుచున్నారు.

అక్బర్: —లోపలికంపుము.

బైరాంఖాన్: —సలాం పాదుషాహ్ ! తమ రేదో దీర్ఘముగ ఆలోచించు చున్నట్లున్నది. మేము వినవచ్చునా ?

అక్బర్: —అవును. ఈ విషయములో మీ యభిప్రాయము కూడ తెలిసికొన దలచుచున్నాను... ఫిరదౌసి అమరలేఖిని మరువరానిది వీరుల విజయ పరంపరలు శిలాతామ్రశాసనముల మాత్రమె మిగులుట పరిపాటి. లోకమున శాశ్వత చిహ్నములకు నూత్నాధ్యాయమును కనుగొనినది గజనీసామ్రాట్టు. ఆ వినూత్నాధ్యాయమును సహజావేశము నొంది సువర్ణాక్షరములశాశ్వతముగ నుండునట్లు లిఖించినది ఫిరదౌసి. షహనామా గ్రంథము లిఖించి మామూదుగజనవీ విజయ పరంపరల కీర్తికి ఘటించిన ఘనతను సంపాదించినాడు ఫిరదౌసి కవి. అంతటి అమర కావ్యకన్నియను ధరకెర చేసినట్లు ప్రవర్తించినాడా కవి. అదియే ఆతని తృష్ణ. సున్నితశాంతి సహనతల నాపాదించుకొనవలసిన ఆ యుగకవి హృదయము ధనలేమి వలన ఆ తృష్ణకు ఆహుతి గావలసి వచ్చెనుకొందును... అయినను, అపూర్వ మనోజ్ఞ నూత్నాధ్యాయమునకు భావము, బాసట పురిగొల్పిన మామూదు "నూతబడిన మానినికి చేయూత నిత్తునని యాశబెట్టి పిదపకరముల వెనుకగట్టు" ప్రవర్తించుట క్షంతవ్యము గాదు. కొలదిగ స్వవితర్కాయైన యోషల అమూల్య ధనాగారాధికారియైన మామూదు తన నామాక్షరముల మంపసమును అమర కీర్తితో నింపుకొనెడివాడే. విశాల దృష్టి వెచుకెంజ వేసె నాతని కాసమయమున. చేతులు కాలిన పిదప ఆకులు పట్టి నట్లయిన దాతని తెలివి తుదకు. ఫిరదౌసి పద్యముల వినునప్పటి

నా యీయావేశమున ఆతని దీనాంత్యావస్థ నాకు హృదయమున మంట పెట్టినట్లుండును. కాని, మామూదు పశ్చాత్తాప హృదయమున యెన్ని అగ్నిపర్వతములు పెటిల్లిన బ్రద్దలయినవో ఊహింపలేము.... ఏమందువుమామా !

భైరాంఖాన్: - కవితావేశమునందు మా పరివేశము స్వల్పము అయినను న్యాయము కవుల పట్లనయినను మరొకరికైనను ఒకటేగదా ? —— —. కవి కావలెనన్న దొరుకడు. కనుదాపులనున్న కవి నాకర్షించి కనక వర్షము గురిసియైనను కవిత్వమును పోషించుట కనసప్రక్రియ పరిపాలకునికైనను పరమావధి యని నా తలంపు కపనాపేక్ష కవి సౌందర్యానందముల గోరులుటకేగాని కీర్తి తృష్ణతో గాడి కలుషితముగారాదు—కీర్తి గతించిన వారి కనీస చిహ్నము గతుకగంజి లేక, కునుక కుక్కి లేక, కట్టగొంచిపాతే లేక, కటకట లాడినా ఆకవి హృదయమునకు పచ్చితరువాతి కనుగొనబడి కీర్తియేమైన శాంతి నీయగలదా ? —నహీ! కీర్తికై గ్రాహిలాటు, కీర్తివంతుల కై వారమూ కానికాలపు కాతుగలకని నాయుద్దేశ్యము. గతించిన కవిని అమరజీవియని కీర్తించి, ఆతనికట్టములపుకెన్న [illegible] గాని, అతనికా కాలమున కనికరముజూపెన కామందు ఏడి ? కీర్తిబుబ్బట-క్షుధార్తుడు కడుపుమంట చల్లార్చుకొనుటకు నీసుగ్రాసనిట్టి భ్రమ. అయిన యీ ముసలికన్నీగుదేనికి?

అక్బర్ :—ఖాన్ జీ! తమరావేశ పూరితులగుచున్నారు న్యాయ [illegible] లు మీయందరూ పందినవి. మీకిదనా న్యాయసంగతుల యావేశము కవిత్వమున జొనిపెన బాగుండును. కాని,—సత్ష్రాస్యత నిక్క చూడలేని అష్టాంకితయైనది.

భైరాంఖాన్:—బేటా! గతించిన విషయములగురించి చింతించ [illegible] వసరము లేదు. నాకిక ఆయాసలేదు. నాకిక గలకోర్కె ఒక్కటియే. అది, మీరు కావ్యప్రవణాసక్తులై రాజకార్యముల ప్రోత్సహింపకుండుట మంచిదికాదని మీకు నచ్చజెప్పవలెనుట. నీవు పదునెనిమిదేండ్లు మించిన యువకుడవు; న్యాయ్య రాజకీయముల పరిపూర్ణుడవైతివి నీవిక రాజ్యభారము వహింపవలయునని నామనవి.

అక్బర్:—న్యాయశౌర్య విచక్షణా పటిమల దీప్తులగు మీరుండ నేనే సర్వము చూడవలసిన యవసర మేమున్నది? నాకింకను సారస్వత తృష్ణ తీరలేదు....పైగా, ఉమర్ ఖయాం ఏమన్నాడు?—"తిను, త్రాగు, ఆనందించు."...

బైరాంఖాన్:—ఆకవి పలుకులు పాటలుగా విని ఆనందించు వేదాంతమే గాని, కార్యరంగమున నిలువలేవు. నేనిక కొంతకాలము విశ్రమింప చూచుచున్నాను. ఒక సేవకుడనగు నేనే సర్వవిషయములు చూచుచుండుట లోకమునకు బాగుండదు, యిప్పుడు మీరే సర్వాంగముల పర్యవేక్షించవలసిన అవసర మెంతయో యున్నది. ఏలనందురా?—ప్రజయనునది నానాముఖ గోచరము. లోకము వివిధపథగామి అట్టి ప్రజను ఘోరహాస్యాలకు భంగములేక నడిపించుటకాక న్యాయమైన శక్తికావలె ఆశక్తియే రాజని ప్రజనమ్ముచున్నది. దేశములదాసోహములందునది కత్తి కాని, ఖడ్గము మనుజులమజ్జను వశీకరించు కొనలేదు. దానికి హృదయపటిమకావలె.—నీతాత బాబరు మొగలాయి పాదుషాల కొకింత రణకీరితి, ధనముల సంపాదించుటకే హిందూ దేశముపై కత్తిదూసినాడు. నీతండ్రి హుమయూను మీవంశమునకై రాజ్యస్థాపన చేయ పునాదివైచినాడు. ఇప్పటివరకు కత్తికృతకృత్యమైనది ఇక మస్తిష్కపువంతు—హిందూదేశ మొకమత్తమత్తేభము. దాని వశపరచు కొనగలిగినవి మీతండ్రి తాతల అంకుశములు మత్తేభమునిక నూరేగించవలె ఈమత్తేభము నలంకరింపవలె, సాదమిడవలె, జయగంటల గట్టవలె, అప్పుడు దాని మూపున సుస్థిరాసన మేర్పరచుకొని ముసి ముసి నగవులతో నీవూరేగవలె.—అంతటి కార్యభారమున్నది నీముందు. విషయలోలతయే "తృష్ణ" యని, ఉమర్ ఖయాం కవికి చెప్పు కర్తవ్యత నిరూపించుకో...కాలము మీరుచున్నది. రేపు రాణా ప్రతాపునిపై యుద్ధమునకు పోవలెను. పాదుషాయును తయారు కావలెననిమనవి,—శలవు, నే మరల కలసికొందును.

[వెడలి పోయినట్లు పాదధ్వని.)

భటుడు:—సలాం పాదుషాహ్! "అనగ" మీదర్శనార్థము.

అక్బర్:—ఎవరు? అనగయా? రమ్మనుము.

అనగ:—(ప్రవేశధ్వని) అక్బర్ బేటా! పరిసర ప్రపంచం ప్రాణసంకటముల పడుచుండ పాదుషాలగు మీరు పుస్తకశ్రవణానందంలో మునిగి యుండుట మాపరితాప కారణమగు చున్నది సుమా?

అక్బర్:—జీ, ప్రస్తుత పరితాపమునకు కారణము?

అనగ:—ఈవిశాల భూమికి పాదుషాలరు మీరు. న్యాయా న్యాయా విచక్షణతో ప్రజనేల వలసిన వారు మీరు. కావ్యపఠ న్యాయనీతులు వినుట వలననే న్యాయరాజ లక్షణములు సంపాదింప నేరవు. కార్యరంగమున దమికినపుడే మీవిజ్ఞానమునకు శోభకూర్చు కొనగలరు.... మేమా ముదుసలులము. చూచినంత కాలమిక చూడలేము. యీచరమ దశయందు మీరాజరిక వైభవము చూచి యానందింప వలెనని నాతలంపు.

అక్బర్:—మీరంద రొక్కటూరుగ నొక మహాసముద్రము నీదుమను చున్నారు. మనవంశ కాణాచి బైరాంఖానా మహాసముద్రమును నిర్వ్యాక్రమముగ నీదుచున్నాడు. ఇంక నాచేయూత ప్రస్తుత మనావశ్యము

అనగ:—ఖాను నొక కాణాచిగ నెంచుచున్నారు కుద్రలగుమీరు. కనుల చూచుచున్నకొలది ఖాన్ క్రౌర్యములు మితిమీరుచున్నవి. పాదుషా హృదయమున హిమాలయమువలె పాదుకొన్ననూ బైరాంపక్షల వెలివెట్టుకున్నచో మా మాతృహృదయముల కశాంతితప్పదు. కాని, కామందులు ఖాతరు చేయవలెగదా!

అక్బర్:—నేపుట్టినదాదిగ నయమునబెంచి మాతృసమానవైతివి నీవు అక్కి నీమాట వినకుందునా!... బైరాంఖాన్ శ్రీ హృదయమున కల్మషమున్నదని మీరనుమానించితిరా?

అనగ:—అవ్వను ఇతరుల మనోభావములనిట్టే గ్రహించగలారు మానినులు. మగవారికి మమతకన్న మరొండు తెలియదు మమత సహజమేకాని అందునను విచక్షణయుండవలె ఖాన్ కాపట్యము నిర్ధారింప నొక్కయుదాహరణచాలు.... మొగలువంశీయుల కోడినమనుజులు హిందువులు ఈ మాగాణమున హిందువు లసంఖ్యాకులు, అధికారకుటుంబము ప్రజలో స్వేచ్ఛగా తిరిగిన పరులకు చులకనయగును. బైరాం,

పాదుషాకతి సన్నిహితుడు, బాధ్యతగలవ్యక్తి. అట్టివాడు హిందువులతో నేస్తముగ తిరుగుటలోని యంతరార్థము పాదుషాపై కుట్రకని మాతలపు. ...మీ బైరాం, హిందువులతో మంతనములాడుటె గాదు మన మొగలుల, అందున మనకతిసన్నిహితులపై క్రౌర్యమూని కఠినశిక్షల పాల్జేయుచున్నాడు. మీరు దీనికేమందురు? రాజవంశ బంధువులలోని ముఖ్యులను తనముందు కార్యమున కాటంకము లేకుండజేసి కొనుటకాదూ!

అక్బర్:—ఆ, ఏమనుచున్నావు? బైరాంఖానునందింత కాపట్యమున్నదనియా? మనయాప్తులకాపదలా? ఏందున?

అనగ:—మరి నేమొత్తుకొనున దాపదయావరించినదనియే. అనగ జీవిత ఫలము ఆదంఖాన్, అధోగతి పాలైనప్పుడు,—అయ్యో, అక్బర్ పాదుషాయొక్క పుత్రాగ్ జీ అక్బర్ రాజ్యమునుండియే బహిష్కరింపబడినప్పుడు, అనగ చావలేక అక్బర్‌తో మంతనములాడుచున్నది. ఇంతకన్న నాకాపద యింకేమున్నది?

అక్బర్:—హా! ఆదంఖాన్‌నకు నా రాజ్య బహిష్కారమా? ఎటుల?

అనగ:—అర్భకుడగు ఆదంఖాను చేసిన యల్పకార్యమణుమాత్రము. అందున ఆతడది చేయలేదనుచున్నాడు. కాని, అది బైరాంఖాను కలుసైనది. అక్బర్ నామమాత్రుడేగాని, బైరాంఖానే పాదుషాగా చెల్లుచున్నాడు. అధికార మావరించుకొనినచో; కాదు కాదు—అధికారము చుట్టబెట్టబడినచో అతడూరకుండునా? తన భవిష్యన్మార్గమును నిరాటంకముగ చేసికొన చూడనంతటి మూర్ఖుడా?

అక్బర్:—అనగా, ఆవేశపడకుము. అక్బర్ బాసట నిచ్చుచున్నాడు. ఆదంఖాన్ జీ యల్పాచారము వినవచ్చునా?

అనగ:—ఊహు! ఆదంఖా నట్టిపనిచేయలేదని అనగ యాత్మ నమ్ముచున్నప్పుడు నోరు నుడువలేదు క్షమింపుడు, మీ మాటకెదురాడి యెఱుగని నేను నేటికి బైరాం ముష్కరుని మూలమున మీకు జవాబీయకున్నాను కాని, ఆదంఖానును నా మోము చూచియైన క్షమింతురని నమ్ముచున్నాను. నా నమ్మకమే వమ్మయిననాడు అనగయు

ఆదంఖాను వెంట అక్బర్ రాజ్యమును వదలుకొనని నమ్ముడు—ఎవరో వచ్చుచున్నట్లున్నది ఇక శలవు. [నిష్క్రమణ ధ్వని]

అక్బర్: —ఎవరక్కడ!

భటుడు:—జీ సర్కార్! బైరాంఖాన్ జీ లేఖయిది.

అక్బర్:—ఏదీ చదివి వినిపించు.

భటుడు:—"పాదుషా హజయాత్రకు సిద్ధపడు చున్నాము. రాణా ప్రతాపుడు రాజీపడెను పనితొందరలో నున్నాను కొలదిసేపటిలో కలసికొందును. సంతకము:—బైరాంఖాన్ మొహరు."

అక్బర్:—సరి యిక నీవు పోవచ్చును.

భటుడు:—చిత్తము....హమీదాబానోబేగం సాహేబా సలామాలేకుం!

[నిష్క్రమణధ్వని, తరువాత ప్రవేశధ్వని]

అక్బర్:—అమ్మా రమ్ము! పిలువనంపిన నేనే వచ్చియుందునే. ఏమైన అత్యవసరకార్యమా?

హమీదాబానోబేగం:—అవును. ఆదంఖాన్ విషయమున నీనిశ్చయ మేమియో అడుగ వచ్చితిని

అక్బర్:— నేటికి నేనొక విమూత్న కార్యము చేయవలసి వచ్చిన దనుకొందును. మీ యుద్దేశ్య మేమిటో వినవచ్చునా!

హమీదాబానోబేగం:—చిన్నప్పటి నుండియు మన యుప్పుపులుసులందిని పెరిగిన దాదంఖాను శరీరము. మానసమునను మనయందే దవిలి యుండుట సహజముగదా? ఒక్కమారుగ మనల నెడబాసి పోవు నుట శోచనీయము, ప్రథమ తప్పిదముగ అతని క్షమించుట మహాబుద్ధి విశాలతను నిరూపించును.

అక్బర్:—కాని, బైరాంఖాన్ తీర్పునధిగమించినచో పర్యవసాన మెటు మారునో? మనకై తన జీవితమునే వెచ్చించుచున్న బైరాం విచక్షణ లేక యిట్లు తీర్మానించెననుటకు ఆధారములేదు.

హమీదాబానోబేగం:—కొలది వానిని గొప్పజేసి కొండెక్కించిరి మీతండ్రి. ఆవిశ్వాస మున్నచో మనసేవయే ఖాన్ పరమావధి. దానికి మన

ముబ్బవలసిన పనిలేదు. విశ్వసనీయు మానిసిగ బైరాం ప్రవర్తించెనని నే నొప్పుకొందును, కాని, మునుపటి బైరాంకాదు— నేటిఖాన్ జీ. మొన్నటివరకు బైరాంఖాన్ ప్రపంచ కాతురలక్షణములను రెంటికి లొంగలేదు. అవి కాంతాకనకములు. అందు కాంతపై కాంక్ష జనించినవానికి కనకాపేక్ష తలవని దీక్ష. నవమాసములుమోసి కని పెంచిన తల్లిదొమ్మల కంపటివెట్టనూ వెనుకంజవేయడు—కాంతపై మమత జవిలినమానిసి. ఈ రెండింటికీ తలొగ్గినవాడు ప్రపంచమున చేయవెరమ కార్యములేదు—ఇప్పుడు బైరాంఖా నొకకాంతకు దోసిలొగ్గుచున్నాడు. అందున ఆమెవింత విపరీతప్రవర్తన ప్రదర్శించు చున్నది. ఇపుడు సన్యాసైన్యమాతని కనుసన్నల గాలెత్తుచున్నది. ఆతని హిందూ సఖ్యతవలన మనమాగాణ మాతనివైపు మొగ్గగలదు. ఈడువచ్చి సర్వజ్ఞుడవైన నీకింతవరకూ రాజ్యాధికారముల ప్రవేశము లేకుండజేయుటయే ఆతని కాపట్యమునకు ప్రముఖనిదర్శనము.... ఇక నీవడిగినప్పుడు రాజ్యమే తనదన వెనుదీయడు. పెచ్చుమాటాడిన అంగబలమున్నదిగదా?—ఎంతో త్వరగ నీవు రాజ్యరథ మాక్రమించినగాని మన భవిష్యత్తు బాగుండదు ఇంకెంతోకాలము బల్లెమును ప్రక్కనిడుకొని శయనించరాదు. అందువలన క్షంతవ్యముగాని మూక్షిత నాపాదించుకొన్నవారి మగుదుము. బైరాంఖా నింతలో నీమాట కెదురాడడనుకొందును. పిలిపించి ఆదంఖాను సంగతి తెల్పుము.

అక్బర్:—అమ్మా! నామనము తామరాకుపై నీటివలె చరించుచున్నది. ముందేమి జరుగనున్నదోగాని, నాకదొక నిక్కచూడలేని దుర్గంధ కూపమువలె దోచుచున్నది...కాని, బైరాం కటాక్షము బడయ గలిగిన ఆవసిత నామాక్షరములు వినవచ్చునా?

హమీదాబానోబీగం:—పర్షియా చక్రవర్తిచే మీ నాయనగారికి పారితోషికముగా యీయబడి, ఆయనచే బైరాంఖానున కుపచర్య నిమిత్తము ంపబడిన ఆ నీటుగత్తె సక్కీబీబీ నెరుగవూ!

అక్బర్:—నిజముగా?...సక్కీబీబీయా?

హమీదాబానోబేగం:—విపరీత మేమున్నది ? అందకత్తియ, సహవాసి బైరాంఖాన్ మానవాతీతుడు కాడుగదా !...సరి పనియున్నది. నే పోదును. [నిష్క్రమణ ధ్వని]

అక్బర్:—బైరాంఖానంతటి కుటిలుడా ? ఆతని ప్రవర్తన న్నా మాటల నమ్మనీయుటలేదు... మాతల్లి, పె పుడు తల్లియూ అన్యథ మాడుటకు గాని, అపోహపడుటకుగానీ కారణము కాన్పించదు — అపేక్ష యనునది మా వనైజము బైరాంఖాన్ నేననుకొనినట్లు మానవా తీతుడు కాకపోవచ్చును...అయినచో బైరాంఖాన్ నన్ను రాజరికము వైపు ప్రేరేపించుట నిష్కల్మషమా, లేక అదియు నొక రాజకీయపుటెత్తా ?

బైరాంఖాన్:—(ప్రవేశ ధ్వని) అక్బర్ పాదుషా యేదో దీర్ఘాలోచనలో నున్నట్లున్నది. మేము లోపలికి రావచ్చునా ?

అక్బర్:—జీ ! కూర్చొనుడు విశేషములు—(అర్థోక్తి)

బైరాంఖాన్:—లేకేమి ! రాణాప్రతాపుడు రాజీపడెను గదా ! రణరంగమున సేనలు యుద్ధమోహ్నవలసిన యవసరము తీరినది. ఇక రాజరికమునకు సిద్ధపడ హెచ్చరిక.

అక్బర్:—మంచిది—కాని, ఆదంఖాన్ విషయమున మీరేదో తీర్మానించిరట, అదియే తుది నిశ్చయమా ?

బైరాంఖాన్:—ఆదంఖాన్ సలిపిన దుష్కార్యమునకు తగినంత మూల్యము నిర్ణయింపలేదనియా మీ యుద్దేశ్యము ?

అక్బర్:—ఖాన్ జీ! ఆదంఖా నొక అర్భకుడు. కుర్రలు చేసిన కొంటెపనులను పెద్దలగు మీరు సరిదిద్దుకొని పోవలెనుగాని నిష్కర్ష చేయుట మేలు గాదని నాయుద్దేశ్యము —అయినను అతని తప్పిదము?

బైరాంఖాన్;—షహర్ పాదుషాహ్! మీరీరోజున యెవరి చెడుమాటలో విన్నట్లు విపరీతముగ ద్వంద్వార్థముగ మాట్లాడు చున్నారు. అతని తప్పిదము లేకుండ శిక్షించుటకు నేనవివేకినా? లేక విరోధినా?

అక్బర్:—అయినను, క్షమించిన బాగుండునా?

బైరాంఖాన్:—క్షమింప వలసిన తప్పిదము కాదది ద్రోహమొనరించినది. ఒక హిందూస్త్రీని బలవంతముగ చెఱుప సైనికుల ప్రేరేపించినాడు. దళనాయకుడయి యుండి సైనికుల కవినీతి గరపుటయేగాక, హిందువుల మానము చెరపించి మన పరిపాలనపై ప్రజ కసహ్యత గలుగు కార్యము చేసిన వాడయినాడు... ఇది హిందూదేశము హిందూప్రజ ప్రాణములైన లెక్కించరు గాని, మానము నష్టముగానున్నపుడు రక్తవెల్లువలకు జాలి తలచరు మనము ప్రజాసమ్మతిగ పాలింపవలెగాని మున్ను తురుష్కరాజు లేగిన త్రోవనడువరాదు. అట్లు నడచినచో మీవంశీయుల ఆశయము శాశ్వత అరాజక మగును. ఈదేశమున ముఖ్యతెగలు రెండు. హిందూ మహమ్మదీయ జాతులు. హిందువుల సంఖ్యాకులు తురుష్కులను రాజ్యప్రాభవ మనుభవించి బలముగనే యున్నారు. ప్రభుత్వము పక్షపాతియు కారాదు. ప్రజల మతము జోలికి మనము పోరాదు. ప్రజ బహు మతముల ననుసరింపనిండు రాజ్యపాలన ఏకసూత్రముపై నడువ వలయును, అట్టి లౌకికము నలవరచుకొని నడచినపుడే మీతండ్రి తాతలయాశలూ మీ ఆశయమూ సిద్ధింపగలవు. ప్రజ యీనాస్య యుద్ధముల మునిగి భీభత్సముగ నున్నది. పరరాజులన్న ఏవగింపు చావలేదు. ఇంకను సామంతరాజులు బలముగనే యున్నారు ఎవరును పౌరుష హీనులు కారు.—ఇక హిందూ, తురుష్క పక్షముల రెంటికీ సమానగౌరవమూ, ప్రతిపత్తి కలుగునటుల జాగ్రతగ మెలగుటయే ప్రభుత్వమనిపించుకొనగలదు. అందున హిందుగడ్డపై పుట్టిన మానిసిని న్యాయప్రవర్తన తప్ప వేరొండు వశపరచుకొనజాలదు ... ఇంతటి విచక్షణతో చరింప వలసిన, నూత్న రాజ్యస్థాపకులమగు మనలోని ఒక బాధ్యతగల వ్యక్తి అట్టి నీచకార్యముల ప్రోత్సహించినచో ప్రజయెంతగా తిరుగుబాటు చేయదలచునో పాదూషా యూహింపుడు.... ప్రభుదృష్టికి సన్నిహితుడు కాబట్టి అశిక్షతో సరిపోయినది. లేనిచో మరణదండన విధింప వలసిన నేరమది

అక్బరు:—మీరు రాజతంత్రమునకు భిన్నముగ నడువరని, నడువనని మేమెరుగుదుము. కాని, చిన్నప్పటినుండియు మనల నంటియుండి మన సౌఖ్యమె తన మేలని పాటుపడుచున్నది. అందున అతని తల్లి

"అనగ" నన్ను నయముగ పెంచి తన తల్లివంటిదయినది. ప్రథమ తప్పిదముగ ఆదంఖానును మన్నించి వదలుటయె మంచిదిసుమా!!

బైరాంఖాన్:—పాదుషాహ్! నా నాలుక జారినదానిని ప్రతిగ్రహింప జాలదు. అది నాకాత్మహత్యవంటిది. బైరాంఖాన్ పనియు నోట 'పని చేయలేని వదరుబోతు' నిపించుకొనును. ఆతని క్షమించుట నాచేతగానిపని. యిక నేటికి సెలవు.

[నిష్క్రమణ: చరచరనడచి దూరమగు నతని ముచ్చెల ధ్వని]

అక్బర్:—ఆ!_ ఏమనెను బైరాంఖాన్! తిరస్కరించెనుగా పాదుషాహను నామాట?? తన మాటయె నిరంకుశముగ చలాయించనెంచుచుండెనుగా???— — మాత. తత్సమాన అనగ, రాజబంధువులు చెప్పిన మాటల యదార్థము నాకిప్పుడర్థమయినది. నిజముగ బైరాం భ్రమలేని మానిసికాడు. మేకవన్నె పులియన్న పోలికపాటుగాను —— బైరాం! నీయాటలిక సాగవు సకాలమున యింటిదొంగను కనుగొనగలిగితిని. ఇక నీయాశలు గాలిమేడలు, యిసుకకోటలు—— హుఫ్! హుఫ్!! బైరాం! నేనెవరనో యెరుగుదువా? హిందూదేశమను మత్తకరికంకుశమైన బాబరు మనుమడను, హిందు తురుష్క రాజుల నల్లలలాడించిన హుమాయూను పుత్రుడను; ఈ విశాలదేశ ప్రభువును —అక్బరును ఇక నానుండి నీ జీవితమును సరిగ తప్పించుకొనజాలవు .........ఆ? ఏమనుచుంటివి! శౌర్య న్యాయమూర్తియై మా వంశశ్రేయమునకే తన జీవితము వెచ్చించుచూ, నా సాయము లేకయే పాలనను సక్రమముగ సాగించుచున్న బైరాం మామనే దూషించుచుంటివా? పొరబడుచుంటి నేను??......... ...పొరపాటుకానేరదు. ఆనాడు, రణరంగమున, హేమూ గూలి మరణయాతన బడుచున్నపుడు——నాచేత ఖడ్గమిడి 'పొడవుము'ని క్రూరముగ ప్రేరేపించినాడు నే వెనుదీయ తానే 'హుమ్మ'ని హుంకరించి అక్షతగాత్రుని కంఠము తెగవేసినాడు. అట్టి రాతి హృదయు డేమిచేయలేడు? నాకొరకై తన జీవిత మంకితము చేయు అవసర మాతనికేమున్నది? అదియు రాజకీయపుటెత్తే. తేనె పూసిన కత్తియగు బైరాంఖానుని ముసిముసి నగవుల నమ్మి చరించినది నేను...రాజరికమున కాలిడుమని చెప్పుటేగాని నిజముగ

నన్ను నిర్బంధించిన దెపుడు?... రాజ్యము, ప్రజ, సైన్యము అంతయు ఆతని అనుమతి ననుసరించుచున్నది. ఇపుడాతడేమి చేయుటకునూ సమర్థుడు—కర్తవ్యము? ..ఆ! నేనేల్చ్బన్ పాదుషానే, చింతించుచున్నానా?—కార్యముపట్ల భీరత మముబోంట్ల లక్షణము గారాదు. నే చేయబోవునది హిమాలయ మంతటి ఎత్తైనది కావచ్చును.

బంగాళాఖాతమంతటి యగాధము కావచ్చును; సహారా యెడారి యంతటి వ్యసనతరముగా వచ్చును. కాని నాకా యెత్తులోతు తృష్ణలనవుసరము. మొగలు వంశమున బుట్టిన మగటిమి జూపించుకొందును...(ఒరతీసిన ధ్వని) బైరాంఖాన్ నీ జీవిత మీ సాయంతనమునకు సమాప్తి నీ కంఠ మీఖడ్గమునకు బలి. నా పరిపాలనకు నీకధికారంకుమనాంది (కత్తి నోరనుండి లాగిన ధ్వని) ఘుదియా, నేటికి నీకొక మహత్తర భక్ష్యము. సిద్ధముగమ్ము (కత్తి జారి పడిన ధ్వని) ఏమీ? నా ఖడ్గమును బైరాంఖాన్ కుటిలుని పైకి బోవ నెంచక నా చేయి జారిపడినదే?...అబ్బా, అక్బర్! నీ జీవిత మహారసంద్రములోని పెనుతుపానునపగల బోవు నావవలెయున్నది, ఛీ! తేరి మాడలేని రాజ్యమున్నది. పరులు చూచినంతనె భయము గొల్పి పరుగెత్తించునంతటి సైన్యమున్నది. పూటకు పుట్టెడు తిను బలగమున్నది ఏమిలాభము? ఒక్క విరోధిని తొలగింప సమర్థత ఛీ, ఏదిపాలుపోకున్నది—అచ్చా, అక్బర్ మానరక్షణకై ఏదీ ఒక్క కత్తి. (పడిపోయిన ధ్వని)

భటులు:—(పరుగిడి వచ్చిన ధ్వని) ఒరే పాదుషాసోలి మూర్ఛిల్లినాడురా! మీరు వీరిని కొనిపోయి అంతఃపురమున పరుండబెట్టుడు. మన చక్రవర్తి కింత యావేశము కలిగించిన ఆ కుటిల బైరాంఖానును ఒక్క వేటున తెగనరకనిచో మనముండి యెందుకు, చచ్చియెందుకు! రండ్రా నలుగురం వెళ్ళి నాల్గు నిముసాల్లో వాణ్ణి చంపివద్దాం.

[గుర్రముల డెక్కల ధ్వని రెండు నిముసములు]

1 భటుడు:—ఓపట్టు దొరకిందిరా. అదుగో బైరాంగాడు పదిగజాల దూరంలో నిల్చుని ఏదో ఆలోచిస్తున్నాడురా.

2 భటుడు:—గుర్రాలనాపండిరా.

బైరాంఖాన్:—ఏమి ? పాదుషావారల నన్నింతనే రమ్మనెనా ?

1 భటుడు:—కాదు. ఖాన్‌జీ కాదు. ఇంతలో మీ యాట సమాప్తి యాసినారు. (నవ్వు)

బైరాంఖాన్:— ఏయ్! నాతోడనే యెకచక్కెములా? తాగి కండ్లుమూసికొని మాట్లాడుచున్నారా? పాదుషా సైన్యపుమంత్రి. సర్వసేనాని, రాజగురువునగు బైరాంఖానునని యెరుగరా? కండ్లు తెరచి చూడుడు.

2 భటుడు:—అజీ! చూడకేం? ఎన్నోకపట తంత్రముల బన్నుచూ అక్బర్ పాదుషాకు పక్కలోని బల్లెమైన కుటిల ఖానును చూచుచునే యున్నాము....మీతో వాగ్వాదమునకు రాలేదు. రాజాజ్ఞయైనది.

బైరాంఖాన్:—ఏమీ? (దీనము) నేనక్బరునకు పక్కబల్లెము నైతినా?— రాజాజ్ఞ ఏమని?

1 భటుడు:—అక్బర్ పాదుషాకు బాంధవ్యతగల వానివలె పైకినటించుచు అక్బర్‌నే రాజ్యభ్రష్టుని చేయ ప్రయత్నించుచు కుట్రలు పన్నుచున్న బైరాం కిరాతుని చంపుమని.

బైరాంఖాన్:—(సాశ్చర్యము) ఏమీ, నాపాదుషా, శౌర్యవాత్సల్య పటిమల రూపగు అక్బర్...నన్ను, తన మామను చంపుమని యాజ్ఞాపించెనా??...అబ్బా, బైరాంఖాన్., నీజీవిత మగాథ పంకిల కూపము. నీ సర్వస్వము అక్బరు పాదుషాయేనను దృష్టితో చరించిన నిష్కపటాచరణమునకు ప్రతిఫలముగ—నేడు నీవు కపటకుతంత్రుడవనిపించుకొనుచున్నావు. నీస్వామియే నిన్ననుమానించెనన్న నీవింకను నిలువున భస్మముగాక కుములుచున్నావెందులకు?... రాజాజ్ఞ మీరరానిది. అంత్యప్రార్థన కానిత్తును....అల్లా, ఖుదావంద్ పర్వర్దిగార్!!! అక్బర్ పాదుషాకు తన జన్మనంకితమిచ్చిన బైరాంఖాన్ నీముందు మోకరిలుచున్నాడు — రేపు అక్బర్ నిజముగు పాదుషా కాబోవుచున్నాడు, నిజమగు ప్రభుతా సమగ్రతతో అతని ననుగ్రహింపుము. ప్రపంచ చరిత్రకారుని అక్బర్ ప్రభుత్వము నొక ప్రథమశ్రేణి ప్రభుత్వముగా లిఖింపనిమ్ము....

2 భటుడు:—జీ. త్వరపడుడు.

బైరాంఖాన్:—రాజాజ్ఞనిక నెరవేర్చుడు. ఇదిగో అడ్డమణు మాత్రము లేకుండ అంగీకరించి వైచుచున్నాను. (గుడ్డ చిరిగిన ధ్వని) ఇదిగో హృదయము, ఒక్క వ్రేటున దీనిని పెకల్చి, భిన్నాభిన్నము చేసి, అంజలి పేనూత్క్రమకోణమున నైననూ, అక్బర్ పాదుషా యందు నాకు కల్మష భావము గల దలుపున్నదేమో చూడుడు. ... ... అలా చూచెదరేల? ... ...వెంటనే నాహృదయమును పెకలించుడు ... ...రాజాజ్ఞ నతిక్రమింప జూచుచున్నారా? బైరాంఖాను నెదుటనే??...... ఆలస్యముచేసి నామనమున కింకను వ్యధకల్పించకుడు. ఆ బడబాగ్నిని కల్పించి నే హృదయ వికలత నొందుచుండచిత్రవధవలె యానందింప వలయు ననియా మీయూహ?......ఒక్క ఖడ్గము మాత్రము నాకిండు. మీరు పిరికిపందలైనచో నాకు నేనైనా హృదయమును పెకలించి యిత్తును. దాని నక్బర్‌కు నాతుది కానుకగా సమర్పింపుడు.—ఊ!—

భటులు:—చూస్తారేంరా! అంతా ఒక్కసారి వేయండిరా.

[నాలుగు కత్తు లొక్కసారిగ ఖండించిన ధ్వని]

భటుడు:—ఆ! చచ్చాడ్రా బైరాంఖాన్, పోదాం పదండ్రా.

[గుర్రపుడెక్కల ధ్వని దూరముగా పోవును]

అక్బరు:—[దూరమునుండి రోదనతో కేకలిడుచూ దగ్గరగును] మామా! బైరాంఖాన్ జీ!!......ఖాన్ మామా! నీముందు మోకరిలినది నేను. ఈకరకు అక్బరు మొరటురాజ్యమున గతిలేనిచావునకు గురైతివా?—అంత అక్బరును, నీసర్వస్వముగ ప్రేమించిన పిచ్చివాడపాను, క్షమింపవూ: .....ఛీ, కనులుండియు చూడలేని కరకునుగు నేనాతని క్షమాభిక్ష వేడుచుంటినా?......నేనాతని కట్టిశిక్ష విధింప కారణమేమి? నేనాజ్ఞ యీయలేదని తప్పుకొనచూచిన నా మాటల తీవ్రతయేగదా నా భటుల ప్రేరేపించినది? దీనికేమి జవాబీయగలను??......బైరాంఖాన్ లోపమేమి?—అసమర్థులయ్యు, నా పుష్పపుటసు జిని రగీగముల జెంచుకొనిన ఉస్తాద్‌జీలవలె కుటిల చాడీల చెప్పక, నేనే తనయాత్మగ నెంచుకొని తిన ఒడలు, జలము, ధీశక్తి, మట్టి రేయింబవళ్లు నాకై వెచ్చించి నిష్కామముగ చరించి

సంగతులకా అతఁ డపరాధియైనది? స్వామి భక్తితో సదాసేవజేయుట యను తృష్ణయా నా దృష్టిలో మరణ శిక్షార్హమైనేమి? .....కావ్య శ్రవణ తృష్ణతో రాజకార్యముల నూరక, బైరాంఖాన్ సేవ నతి తృష్ణలో చూడఁగాని; ఖాన్ రాజకీయ బోధల తృష్ణతో వినియు జీర్ణించుకొనలేక; అజ్ఞానులయ్యు కైవారములిచ్చి స్వార్థమునకై తృష్ణతో చాడీలు చెప్పనవారిని వేదవాక్కులని నమ్మి, పాదుషాను మహాంక్షతతో బైరాంఖాన్ చావే కావలెనని తృష్ణతో వదరిన నాకింకను ఆ యమరమూర్తి క్షమాభిక్ష నిడవలయునా? పచ్చియు నాకోర్కె దీర్పవలయుననియా నా తృష్ణ??......ఛీ! నాజీవితమిక నిరర్థకము ......ఏయ్! ఎవరక్కడ?

భటులు ప్రవేశధ్వని:—జీ! హుజూర్ !!

అక్బర్:—అక్బర్ పాదుషాను—కాదు కాదు, బైరాంఖానును ఖూనీ చేసిన కటికకసాయిని, నన్ను చంపి పుణ్యము కట్టుకొనుడు—ఊఁ! త్వర పడుడు !—ఛీ నిష్కల్మషుడైన బైరాంఖానును, అహింసాయుతుని చంపగల దీక్షకాయులు మాత్రమే గాని; పచ్చినెత్తురు ద్రావగల నాపై చేయివేయగలరా—మీరు. లాభమగు పని మీరు చేయలేరు. లెండు, యీ పాపిని యీ లోకమునుండి వేరుచేయుట కాక ఖడ్గము నిండు. నా మానసమును కాపాడుట కొక్క కత్తినిండు అబ్బ! చచ్చియైన బైరాంఖాన్ మహాత్ముని పాదములంట నిండు...ఊఁ... అబ్బ—ఆయాసము. ఇక ఖడ్గమిండు (జారిపడిన ధ్వని)

ఒకపాట:—

పుడమి మానవుల - పూజించవుగా—
చనిపోయినచో - చింతయేలనో ?
గడచిన దేదో - గడచిపోయెగా—
ముందు విషయ - మాలోచించుము
పోయిన వారితో - పోలేవుగదా—
పోయియుచేసే - పనియేమున్నది ?
గడచిన కార్యపు - ఘనతయేదిరా
దాని పూర్ణమే - ధర్మ నియతిరా !!

# చిత్రాంగి

## చిత్రాంగి — సారంగధరుడు

[రాజరాజ నరేంద్రుని భవనమున చిత్రాంగిగది. గోడల కొకటి రెండద్దములు, ఒకగోడను రాజరాజుకు చిత్రాంగుల పటము. వేరొక గోడను సారంగధరుడు రాజరాజు నమస్కరించుచున్న పటము. మరొక గోడను పతివ్రతలు వారి భర్తల పటములు. నాల్గవగోడ మధ్యగల ద్వారమునకు నగిషీ చెమికీ తెర. అందాలరాణి చిత్రాంగి పట్టుపాన్పుపై సాలోచనగ పరుండి యుండును ]

చిత్రాంగి:—(నిట్టూర్చి) అబ్బ!...ఏమియు పాలుపోకున్నది....తలనెరసిన రాజుకట్టిన తాళిబంధ మొకవైపూ, యౌవన పుష్పపు తొలిచూపు నుండియు సారంగధరుని వైపె యగ్రముసాచి పెరిగిన ప్రేమబంధ మొకవైపునూ...కర్తవ్య నిరూపణ సాగుటలేదు ...స్వార్థ సంకుచిత సంఘము తాళివైపూ, విశాల మనోదృష్టి ప్రేమవైపును... ప్రేమదృష్టి నాదొక్కటియె. కాని, సంఘదృష్టి పలువురిది. సంఘము కొరకై ఒక మానిసి క్షేమమైన త్యాగము చేయవలె....కాని ఆత్యాగము వలన సంఘమునకు శ్రేయమొదవి నప్పుడెగదా...సార్థకత? ఏమైనను, వేణువునగాలి పూరింపబడినప్పుడెగదా—మధుర సంగీతము జనించుట? సారంగధరుని దృష్టి నాదృష్టి ననుసరించినగదా— నానోముఫలించుట?! మాయిరువురి ప్రేమఝరియలూకొంతకాల మేకముఖమున ప్రవహించినవి. ఏకమగుచోట ముసలిరాజు కామశిఖర మడ్డు దవిలినది. మరల ఆఝరియలు సంగమింప ప్రయత్నింపకుండునా? సారంగధరుని మనమునూ నావలె ప్రయత్నింపదా?? ఏదియు తెలిసికొనుటకు విడివడిన నాటినుండి నేటివరకు మరల మేము కలసికొన సంభాషింపలేదుగదా!!!........రాజవేట కేగినాడు. సారంగధరు డూర నేయుండును. మేము కలియుట కిది మంచి సమయము —కాని; వెలవు! దాసీజనులచే కబురంపిన యుపోహలు పొడమును నే నేపోదమన్న రాణివాసపు మర్యాదకు భంగ

మందురు. ఆతడే యిటకు వచ్చుటకు ప్రయత్నించునని తలంపను.—ఇక కర్తవ్యము?......ఏదేని యాలోచించి మార్గము కనుగొనవలె. (పచారించుచూ) తలపువోడమినంత ఆతని దాపుననున్నట్లు తోచుచున్నది. వెఱపునకంటె ముందు ఆతనితో ప్రేమసంభాషణలకై పు మనసు పర్విడుచున్నది. దేహమంతయు ఆతని చూపుల మాటలతో స్పృశింపబడుచున్నట్లున్నది. (రవికె సరిచేసుకొనుచు) అబ్బ, బంధము బిగిసినట్లున్నది!!

[రెక్కలల్లాడ్చుచు ఒక పావురము వచ్చి తెరచియుంచిన కిటికీ తలుపుపై వ్రాలి గదిలోనికి చూచుచుండును.]

(ఆశ్చర్యానందముతో) యువరాజు ప్రేమను స్వాదించుచున్న పావురము (?) ఇచటికేల వచ్చినది!! ప్రియుని సందేశము కొని రాలేదుగదా!? (పరీకించి) పెసల మేసినగాని దీని ఆయాసము తగ్గదు. (లోనికేగి, వచ్చి పాన్పుపై పెసలు జల్లును)

[పావురము పాన్పుపై వ్రాలి పెసల దినుచుండును.]

చిత్రాంగి:—(పాన్పుపై కూర్చొని మెల్లగా ప్రయత్నించి పావురము నొడిసి పట్టుకొనును.)

ఏమే ఓ పావురమా - ఏమా చూచెదవూ?
ఎవరే నేర్పినదీ - ఈ వార్తావాహకమూ?
నీకెవరే నేర్పినది - ఈ ప్రీతి పనులూ??

(అటు నిటు వెదకి ఏ లేఖయు కన్పించదు. తలయెత్తి చూచుసరికి సారంగధరుడు ప్రవేశము.)

చిత్రాంగి (నిలచి):—యువరాజా? (!) ఎంత సుదినము! ఏమని సంబోధించుటయును తోపకున్నది...(ఆసనము చూపి) కూర్చొనుడు.

సారంగధరుడు:—క్షమింపుడు నా కొరకై స్నేహితులెదురు చూచుచుందురు. పావురము పొరపాటున మీ యంతఃపురమున ప్రవేశించినది. దాని దయచేసిన నే పోవుదును.

చిత్రాంగి:—పొరపాటున కాకున్న నాకు మీ క్షేమము తెలియింప రాగూడదా! కొలదిగ విశ్రమింపుడు. నాకంటె స్నేహితు లెక్కుడు కాబోరనుకొందును—చిరకాల దర్శన మొసంగియు త్వరయేల?

సారంగధరుడు:—నా సపత్ని ఘట్టమున పావురము పారి వచ్చినది. ఆలసించిన మిత్రులు గేలిసేయుదురు. ఏదైన పనియున్న సెలవిండు, శిరసావహింతును.

చిత్రాంగి:—పనిలేకపోలేదు. పెండ్లినాటినుండియు మీరు దర్శనమిచ్చియుండలేదు. కారణమడుగ వచ్చునా?

సారంగ:—అమ్మా! నన్ను "మీరు"ని సంబోధించి బాధపెట్టుచున్నారు. కుమారుని నన్నట్లు పిలుచుట పొరపాటని యనుకొందును. పనిలేకపోవుటచే మిమ్ము కలసికొనలేకపోతిని క్షమింపుడు.

చిత్రాంగి:—నన్నమ్మ యని పిలచుటకు నేనేమంత ముసలినా? లేక హేళనచేసి నొప్పించుటకా?

సారంగ:—నేనిమ్ము నొప్పించునంతటి పాపినా? మాతృసమానలగు మిమ్మమ్మయని పిలచుట యుక్తమే?—నేడు మీ రేదో పరాకుగనున్నట్లున్నది. సెలవిండు యిక పోయివత్తును

చిత్రాంగి:—వచ్చిన క్షణము నుండియు పోదునందువు—నా సమ్ముఖమంత నరకముగా నున్నదా?... మీ దర్శనము కై కన్నులు కాయలు కాయునట్లైనను చూచుచున్నందుల కదియా ఫలితము? అయిన నన్ని ట్లు [illegible] కృశించుచుంటినయేనా—మీ తలపు?

సారంగ:—అమ్మా! నన్నిక నట్లు సంబోధించిన యిటనుండలేను. నేడు మీ రేదో యావేశవశముగ మాట్లాడుచున్నారు. మీ మాటలు నాకర్థమగుటలేదు. ఇక నన్ను పోనిండు. నే చేయవలసిన పనియున్న భటునితో కబురంపిన సేవింతును. ఇక సెలవు. (లేచిపోబోవును)

చిత్రాంగి,—(అడ్డునిలచి) తొందరపడకు. మగల మనసు కలిసికొనుట కుదు[illegible] నే చెప్పదంతయు స్వయముగనే వినవలయును. ఇది మన యిద్దరి మధ్యనే పరిష్కరింప బడవలసిన కార్యము ... లోకము నా యెడ నంతటి క్రూరము వహించినది. కాని, నీవును

యిట్లు "ఆవేశము"నియు "అర్థముగుటలేదు"నియు సెలవిత్తురను కొన లేదు....ఒకే లతనుపుష్పించిన పూవులకు రెండు వేర్వేరు వాసనలా? యౌవన ముదయించి నప్పటినుండి ఒకేయాశయముతో పెరిగిన మన మనములు, మధ్యకలిగిన యాటంకము వలన వేర్వేరు పథముల నడచు చున్నవా?.. నిజముగ చెప్పుము, నీవును మన కలయికకై తహతహ పడుటలేదా?

సారంగధరుడు:— అమ్మా! నిజముగ నాకట్టి యావేశమునులేదు. గడచి నవి నాకిప్పుడు గుర్తులేవు మీయెడ నేనేదోషముగనైన ప్రవర్తించిన నన్ను క్షమింపుడు, లేకున్న శిక్షింపుడు. అంతియుకాని....

చిత్రాంగి:—గడచిన విషయము నింతలో నే విస్మరించితివా? ఎంతటి యమానుషము. దరిజేర్చి ఆశయముతో నావనెక్కించుకొని నట్టేట ముంచి ముంచుటా?...చిన్నప్పటి నుండియు నన్ను ప్రేమించినట్లు నమ్మించి, తీయని పలుకులతో ఆకర్షించి, ప్రేమింపబడి వివాహ కలాపమున మన ప్రేమను దృఢతరముగ చేయనెంచియు, అన్యాయ ముగ జరిగిన యీమిడిమేలము వలన యిప్పుడు ఏమియు యెరుగ నందువా? నిజముగ నన్ను నీవు ప్రేమించలేదా? అనృతమాడి నాయుసురు కట్టుకొనకుము.

సారంగధరుడు:—ఏమని చెప్పగలను. ప్రేమించకుండుటేమి? నాజన్మాంత మువరకు నాతల్లివలె మిము ప్రేమింతును. బాల్యచాపల్యమున పూర్వము మిము మరొకవిధముగ ప్రేమించియుండిన కుమారుని తప్పులు క్షమింప వేడుచున్నాను. మీపాదము లంటుదును. యిక నన్నాగడిచిన మాటలతో యేడ్పింపకుడు.

చిత్రాంగి:—అబ్బ! ఎంత సునాయాసముగ తేల్చివైచితివి? ఏండ్ల కొలది సంచరించిన విధము బాల్యచాపల్యమను పేరున తుడిచివేయ చూచుచుంటివా? ఇరువదేండ్లు వచ్చినను బాలుడవేనా? ఒక్క క్షమాపణార్థముతో ఎంతటి స్వార్థత తీర్చుకొన చూచుచుంటివి?. అబలనగు నానుండి క్షమాపణయను బలమును గూడ హరింపజూచు చుంటివా? నీ స్వార్థతృష్ణకింకను నన్నుపయోగించుకొన చూచు

చుంటివా ? నీకన్న చిన్నదగు నన్నమ్మయని పిలచి యింకను పాప మొడిగట్టుకొందువా?

సారంగధరుడు:—అమ్మా? ఇక వినలేను. నీయారోపణలు నిజమైననూ, యిప్పుడు వాటినిగురించి తర్కించుకొనుట వలన లాభములేదు. జరిగిపోయిన విషయములను మననము చేసికొనుచూ కూర్చుండుట వలన అమూల్య కాల మనవసరముగ వెచ్చింపబడుటా, హృదయావేదనా తప్ప మరేలాభమును కలుగబోదు నాతండ్రికి ధర్మపత్నివైన మిమ్ము అమ్మయనిపిలచి క్షమాభిక్షయర్థించుటకన్న వేరొండు పరమావధి నాకులేదు నేనీ క్షమాపణల చెప్పుకొనలేదనియే మీకోప మనుకొందును. కారణాంతరములచే కాలవిలంబనమయినది. ఇకనైన క్షమించి నను విడువగోరుచున్నాను.

చిత్రాంగి:—గతించిన విషయములన్నియు కలలనుకొనునంతటి మూర్ఖత నాయందులేదు. అనుభవించిన వ్యవస్థల నెమరువేసికొని భావి జీవితము నానందమయముగ జేసికొనుటయే మానుషత్వమనుకొందును.— చేసిన పనుల మరచినట్లు ప్రవర్తించుట కృత్రిమలౌకికము. నేకోరునది క్షమాభిక్షలుకావు.- మనము మొదటినుండియు చేరుదమనుకొన్న గమ్యస్థానము చేరుట కెల్లప్పుడునూ ప్రయత్నించుట......నాయిష్టములేకుండ యజ్ఞపశువును బలియిచ్చినట్లు నన్ను మీతండ్రిగారి కిచ్చి నాల్గు మంత్రముల చదివించినంత మాత్రమున నేను మీమాతను కాజాలను. తాళిశరీరము నెగతాళిపాలు చేయుటకెగాని, మనసు నాకర్షించుకొనజాలదు. నాయుద్దేశ్యములో సమయము మించలేదు. ఇకనైనను మనము మనగమ్యస్థానమువైపు నడచుటయే పరమావధి.

సారంగధరుడు:—అమ్మా ! విపరీతపు టూహలతో మిథ్యా భ్రమకలిగియున్నావు. మన కర్మభూమిలో వివాహముకంటె పవిత్రమైన బంధము మరొండులేదు స్త్రీపురుషులు తమ జీవితాంతములవరకు వివాహమను సాంఘిక సంబంధమునకు కట్టువడియుండవలసినదే. వివాహ పరమోత్కృష్ట కలాపమును కాదనినవారికి యీ భూమిపై నిలువనూ స్థానముండదు. మతసమ్మతమగు వివాహముపట్ల మనసునందైన భేదభావమున్న వారికి యిహపరములందునూ రౌరవనరకము తప్పదు.

చిత్రాంగి:—ఈ పిరికితనపు మాటలతో నన్ను నొప్పింపనెంచకుము. వివాహము వేడుకకొరకునూ, పదుగురకూ ఆ స్త్రీపురుషుల ప్రేమ వెల్లడియగుటకునూ, ఆ స్త్రీపురుషులు తమ భావిజీవితముల నడుపుకొనవలసిన విధానములు మిత్రులు తెలియజేయుటకునూ పనికివచ్చు ఒక కలాపము. ఆ స్త్రీపురుషు లిరువురూ తత్పూర్వము భార్యాభర్తలుగా యితరుల ప్రేమించియుండనిచో, వారి జీవితముల కలయికకు వివాహకలాపమనునది నాంది, తరువాత ఒండొరులు ప్రేమించుకొనుట పరిపాటి. మనయిర్వురపట్ల అట్లుకాదు. మన మొండొరులము భార్యాభర్తలముగా ప్రేమించుకొనుటయే నాంది; యిక వివాహ కలాపము జరిపించుకొనుట పరమావధి. ప్రేమ గ్రహణము ప్రథమ ప్రధాన విషయము, పాణిగ్రహణము తరువాత. మన మొండొరులము ప్రేమగ్రహణ మెప్పుడో జరుపుకొంటిమి. స్త్రీ పురుషుల జీవితములే కాక యావత్ప్రపంచమున నడచుచున్న ప్రేమయే మూలాధారముగదా? మధ్య వచ్చు స్వార్థపరుల ఆటంకముల నతిక్రమించి నపుడే మానిసులనిపించుకొనగలము. ప్రేమ పూర్వకముగ ఒకరి జీవితము నొకరి కంకితము చేసికొన్న మన మనః పరిణయమును సరకు గొనక, కేవల బాహ్య కలాపమైన తాళిబంధనా తంతునకు భయపడుట అవివేకము. వివాహమైన తరువాతగూడ స్త్రీ పురుషు లొండొరు లేక ముఖమున నడువకున్న యిహమున రౌరవనరక బాధలందవచ్చును. ప్రేమయేమున్నను ఆంతరంగికముగ భార్యాభర్తలైన వారిలో ఒకరిని స్వార్థపరులు కొందరు మరొక జీవితో ముడి పెట్టినచో వారికి యిహమున రౌరవ నరక యాతన తప్పదు. కాని, ఆ వేరు చేయబడిన వ్యక్తులు మనఃపూర్వకముగ ప్రయత్నించి మధ్య వచ్చిన బంధనల కాలదన్ని ఏకమగుట వలన స్వర్గసౌఖ్యము అనుభవించగలరు. మనలో నే వేరుచేయబడి యీ ముసలి వస్తువు తాళిచే కట్టు బడితిని. ఈ తాళికి తలయొగ్గి మన మానసిక వివాహమును నెట్టివేసినచో నాకు దుర్భరయమ యాతన తప్పనిసరి. కావున నీ తండ్రి స్వార్థతను గోసి మన మేకమగుటయే పరమావధి. అప్పుడే మనకిహ సౌఖ్యము లభ్యమగుట. ఒకవేళ పరమనునది యున్నచో ప్రేమ స్వార్థబద్ధమగు మన కలయిక వలన అచటను సౌఖ్యమయగీతులయేమగును

అధికార స్వార్థతృష్టలతో మనల నెడబాటు చేసిన మీ తండ్రికి పాఠము నేర్పి యాదర్శజీవితమిమ్ము. మానసిక విశాల దృష్టితో ఆలోచించుకొమ్ము. న్యాయమున కెదురాడ నేరవనుకొందును.

సారంగధరుడు:—మీదొక విపరీత తృష్ణవలె తోచుచున్నది. మీ యీ దేశమునే కొనసాగింప దలచినచో రాజద్రోహమూ, పితృద్రోహమూ, సంఘద్రోహమూ, మతద్రోహమూ, తలదాల్ప వలసివచ్చును. సంఘమునకు వెలియై ఏ జీవియు మనజాలదు ఒకటి రెండు జీవుల భావములతో మాత్రమే కట్టుబడినది కాదు—సంఘదృష్టి. పలువురు విజ్ఞుల భావముల సంపుటీకరణియగు సంఘదృష్టిలో వివాహము పరిమోత్కృష్టము. మీకునచ్చినంతమాత్రమున సంఘదృష్టినిత్రోసి రాజనుట సంకుచిత దృష్టిఫలము. సంఘశ్రేయమునకై ఒకటి రెండు జీవితములు బలియైనను మంచిదియె, మన పూర్వ జీవితభావముల తుడిచివేసి సంఘమున ప్రముఖ స్థానమగు మాతృస్థానమున మీ మూర్తినుంచి పూజింతును. ఇక వేల భావములతో నా మనసును సంకుచిత పరప కుందురని నమ్ముచున్నాను.

చిత్రాంగి:—సంఘపిశాచి! బాహ్యదృష్టి తప్ప మనోదృష్టి లేని గుడ్డి సంఘమునకు భయపడుట పిరికితనము. మనోదృష్టి గల భావములెప్పటికిని సజీవములే కాని; బాహ్యదృష్టి మేడిపండునకు భ్రమపడునట్టిది. సంఘ శ్రేయమునకై నాజీవితము బలిదానము సేయవెరువను. కాని బాహ్యసంకుచితదృష్టిగల సంఘమునకు రేనిట్లే జీవచ్ఛవము వలె నుండుట వలన లాభము మృగ్యముగదా? మనము ప్రేమించు కొనకే పూర్వము నాహృదయమొక నిర్మల వస్త్రము దానిపై ప్రేమ యను కుంచెతో నీచిత్రము చిత్రింపబడినది! ఇక దాని చెరుపుటశక్యము. నాహృదయములో నీకింకొక విధమగు స్థానమీయలేను. నిర్మల మధుర ప్రేమాదర్శులగు మనబోంట్ల కలయిక వలనగదా సంఘమునకుశ్రేయము కలుగుట.... సర్వయౌవన సుందర సమంజస వయస్కుడవగు నీయుండనుండ వలసిన నేను (రాజరాజ చిత్రాంగుల పటము జూపుచు) యీముక్కోపి ముసలి ముక్కుడిపంచ అడవి గాసిన వెన్నెలవలె యుండుటయేనా—సంఘశ్రేయము?!

సారంగధరుడు:—భర్త కుంటి, కురూపి, రోగిష్టి, ముదుసలి...మరెట్టి వాడైనను అతడే పరమ దైవతముగ, అతని తోడిదే తన స్వర్గముగ తలంచి యాతని సేవించుటయే భారతనారి పరమధర్మము. పరిణయ మాడిన భర్తనట్లు దూషించుట పతివ్రతల లక్షణము కానేరదు. భర్తను కాదని యిట్టితరుల గోరుట కామతృష్ణాంధతయనిపించు కొనును.

చిత్రాంగి:—భారత నారు లెవ్వరును తాము ప్రేమించిన భర్తలనుండి వేరు చేయబడ లేదనుకొందును. తనబంధు విరోధి అన్యకులస్తుడైన కృష్ణుని ప్రేమించి రుక్మిణి యాతని పొందినది. సావిత్రి, దమయంతి తమ ప్రియులకై గాసిచెందిరైన వారిని పొందిరి. నేనట్లు నిన్ను పొందు టకు ప్రయత్నించినను, నీవు కనికరింపక పోవుటచే విఫలనైతిని. పూర్వ ప్రియులవలె నీవు ప్రయత్నించలేదు ప్రేమించిన నీవెగాని అతాళికట్టిన రాజు నా భర్త కాడన్నప్పుడు నిన్ను కోరుటలో తప్పే మున్నది? కోరినభర్తను పొందుట కామతృష్ణయా? కొడుకు కేరు వరచిన కాంతను ముసలియయ్యు తానే పరిణయ మాడుట కామతృష్ణ కానేరదా?? నాది కామతృష్ణయే యైన నీకొరకే ప్రాకులాడవలసిన పనియేమున్నది శరీరకామ మేరివల్లనైనను తీరగలదు. కాని నాది మానసిక కామము. దానికేరును కల్మషతృష్ణ నాపాడింపలేను.... ఇకనిట్టి బెదిరింపులతో నన్ను వేధింపకుము. నా కోర్కెలలో విపరీతము లేదని నమ్ముము.

సారంగధరుడు:—అమ్మా! నేను చెప్పినను నాదృఢనిశ్చయమును మార్చ జాలవు. నేనట్టి కామతృష్ణ కాహుతి కాజాలను. నేనిన్ను మాత కంటె యితరముగ గ్రహింపజాలను. నీపాదములంటుదు. నికనిట్టి కోర్కెల మానుము.

చిత్రాంగి:—(నిరాశ, ఏహ్యములతో) సారంగధరా! నేనీక్షణము వరకు నీవొక వివేకివను కొంటినిగాని యింతటి సంకుచిత భీరుడవను కొన లేదు ...నీవలె నాకునూ రెండు నాలుకలులేవు. నాహృదయ భర్త నీవుతప్ప యింకొకడు కాజాలడు. నిన్ను భర్తగా పొందని నాజీవి తము నిరర్థకము, ఎడారి శంఖధ్వని. నీచే తిరస్కరింప బడిన నేనిక

మనజాలను నేనిక రేపటి యుదయమును చూడదలచుట లేదు. కామము, కామతృష్ణయను వదజాలముతో నాలో యెన్నడు జనించని కామము నొకదానిని నీవిపుడు సృష్టించితివి. దాని నార్ప నీవె సమర్థుడవు నాజీవితాంత్యపు యీ స్వల్పకోర్కైనైన మన్నింప ప్రార్థించుచున్నాను (దగ్గరగ నిలిచి స్పృశింపనెంచును)

సారంగధరుడు:—అమ్మా! ఇది లోపము. నీకోర్కె తీరనిది. అది నాచేత గానిపని క్షమింపుము. శలవు నేనిక పోయెదను (పోబోవును)

చిత్రాంగి:—(చేతులుపట్టి పైనానుకొనచూచుచు) పూవులు కాయలు ప్రసవించవలసిన నాజీవిత మింతవరకు పురుషస్పర్శ నెరుంగదు. నా అంతిమ ఘడియ లాసన్నమయినవి. ఒకసారి మాత్రము నాకా సౌఖ్యము రుచిచూపుము. ఇతరులను తెలియునని భయపడకుము. సేవకులు దాపునలేరు. మీతండ్రి యూరిలేడు, గది తలుపుల బంధించనా? . ...ఇది తప్పనికోర్కె దీని నతిక్రమించినచో నీవు జీవిత పర్యంతము విచారింపవలసివచ్చును. జాగ్రత.

సారంగధరుడు:—(విడిపించుకొని) ఛీ! తల్లియని యింత తడవు మాట్లాడుట నాదియే తప్పు. ఈపావురము రాకున్న యీదోషము నాకు తగుల కుండెడిది! అమ్మా! నాజీవితము నికృష్టముగ అంత్యమైనను యీ తుచ్ఛ కార్యము నాచరింపజాలను. మీయిచ్చవచ్చినట్లు నన్ను శిక్షింపవచ్చును. శలవు. (బిరబిరా పారిపోవును)

చిత్రాంగి:—(హతాశయై పానుపుపైబడి) అబ్బ! ఎంత బోధించి, బ్రతిమాలి భంగపడినను సారంగధరుని మనసును మార్చలేకపోతిని. ఒక్కసారి గదా!......ఇంతటి సౌందర్యము, యౌవనము ఒక్కసారైయైన నుపయోగించుకొనబడక నిరుపయోగమైపోయినవిగదా.........ప్రియునిచే తిరస్కరింపబడిన నాజీవితమిక అంత్యముకావలసినదే... ...లేరవు??......ఆత్మహత్య!— ఆ! తప్పనిసరి!! ............ పోయెడు నాజీవితమునకు యీ పదునెనిమిదేండ్లూ నిరర్థకముగ నిండినవి. ఒక్కరికిని శాశ్వతస్మృతి పథమున నాఛాయ లేకపోవచ్చును. .........కాని నేనిపు డావేశమునకోరిన కామవిషయము సారంగధరుడు నలువురలోచెప్పిన నిజముగ నేనొక కామాంధురాలనను

కొందురు. నాచరిత్ర నల్లని యక్షరముల హేళనగ వ్రాయబడును. ......దీనికి ప్రతీకార మూహింపవలసినదే ........సారంగధరుని బ్రతిమాలుటకు తెరవు లేదు.... . మరి?.......... నా మనము నేనిష్కల్మషనని చెప్పుచున్నపుడు నేనిక భయపడవలసిన యవసర మేమి? ...... కాని, నాజీవితమును భంగపరచిన సారంగధరునికి నాశక్తి చవి చూపించ వలయును. — ఎట్లు? (ఆలోచించి) ఆ!...నన్ను చెరుప ప్రయత్నించినట్లు రాజుతో నమ్మ చెప్పినచో సారంగధరు డెట్టి కష్టముల పాలైన సేయబడును. కామాంధులకు స్త్రీ మాటయేగదా మక్కాని?...చివర కాంతని కాలుసేతుల పట్టి బ్రతిమాలి గదా భంగపడినది. ఇక ఆ కృతఘ్నుని కాలుసేతులుండరాదు. ఇదె స్త్రీ శక్తి ప్రతిష్ఠ, తోక త్రొక్కబడిన యూహు త్రాచుపగ సారంగధరుని తెలియంగ గలడుగాక. ఓహ! అని దానినని మలకనచేసి నా జీవితమే పాడుజేసెను గా?

(తెర త్వరగ)

# తాజమహల్

[ఇది జరిగిన చరిత్రగా మనకే ఆధారాలూ లేవు. కాని; నా కలం మీద నాకెంత హక్కున్నదో; రాజరిక ధనాగారం మీద ప్రజల కంతటి అధికారమూ వున్నది. ఈ నవయుగాదర్శ దృష్ట్యా యీ రచన జరిగినది. కాగా, యిది చరిత్రలోని పాత్రల హృదయ భావాలు పాల్గొన్న నాటిక మాత్రమే. —రచయిత]

* * *

దృశ్యం:—తాజమహల్ ప్రాంగణమున చలువరాతి కొలను పున్నమరేయిని ఆ ప్రశాంత వాతావరణంలోనికి నలువురు శిల్పులు అప్పుడే అచటకు చేరుకున్నారు

* * *

ఇటలీశిల్పి:—(కూర్చుని) హమ్మయ్య! ఇపుడింకేది జరిగినా చింతపడను.

గ్రీకుశిల్పి:—(కాళ్ళు నిమురుకొనుచూ) ఓహో! మూర్తీభవించిన యీ శిల్పసృష్టి, తాజమహల్‌ను చూచినంతన దూరాగమన శ్రమపటాపంచలై పోయినది.

బందరు శిల్పి:—అంతియగాదు! నిండుపున్నమ వెన్నెలలో మునుగుచున్న యీ తాజ్‌పైనుండి వచ్చు వాయు స్పర్శ మాత్రాన సర్వాంగముల పైనను కళాశారద నాట్యమాడుచున్నట్లు పులకలెత్తుచున్నవి.

ఇటలీశిల్పి:—కాని: మన మొక లోపము జేసితిమనుకొందును.

గురుశిల్పి:—ఏమది?

ఇటలీ శిల్పి:—తాజమహల్ నిర్మాణము పూర్తియయిన తరువాత నే మాదేశమేగి దాని సౌందర్యము మిత్రుల కుగ్గడించునపుడు ఒక సంశయ మొదవినది శిరీష కుసుమమువలె తాకినంతనె కందునట్లు మలయించబడిన యీ కళాదేవి—కాలవశపుటెండ గాలులకు, యాత్రికుల స్పర్శలకు మలినముగాకుండ నుండుటకై యొక గాజు తెర నమర్చక పోతిమే యని విచారించితిని.

గురుశిల్పి:—అహాహ్హా? మీ తెలివి వెర్రితలలు వేసినట్లున్నది.

బందరు శిల్పి:—ఏమది?

గురుశిల్పి:—గాజు కాంతిని కొంత ప్రతిఘటించి వెనుకకు నెట్టుచుండును. అందున లోపలి వస్తువుపై పడవలసిన కాంతి తగ్గును. పైగ గాజు ఫలకముల సమీపముల కాంతి దట్టమగును. అట్లు మిక్కుటమయిన కాంతి చూపరుల దృష్టిలో కొంత వెల్లగినపుడు మసకను కలిగించును. అందువలన లోపలి వస్తువు యదార్థపు సొబగులన్నియు బాగుగ కన్పింపవు. పైగ తాజమహల్‌లోని ప్రముఖ విశిష్టతయగు చల్లదనపు పులకరింతలు చూపరకందకయుండును.

బందరు శిల్పి:—అవునవును. మన యిటలీ మిత్రుని యూహ కొంపు దాల్చినట్లయిన తాజమహల్ సహజ సౌందర్య పటిమ చూపరుల దృష్టికి పూర్తిగ లభ్యముగాక కుంటువడియుండెడిదిగదా! సరి పధక పరిపూర్ణ శిల్పమూర్తి నొక ఛాయ కప్పివేసెడిదే.

గురుశిల్పి:—బాగు బాగు!...కాని, తాజమహలునందేలోపమూ లేదనియే మీరు నమ్మి యుబ్బితబ్బిబ్బులగుచున్నారా?

గ్రీకుశిల్పి:—ఇంకను యీ కళాధిదేవి నిర్మాణమున యసంతృప్తి యున్నదని మీరనుమానించుచున్నారా? కసిగందని, ముదురుతేవదని ముంతాజ్ మేనును గుర్తునకు దెచ్చునట్లుగ గోపురభాగములు ప్రస్ఫుట దృఢములై యున్నవి గదా? రాణి సుస్నిగ్ధ పటుత్వకపోలములా గోపురములలో కన్పించుచునేయున్నవే!

బందరు శిల్పి:—కళాకారయలంకార సుందరముల ద్రాక్షాపు యూపె రెంపుల నవ్యకను మాసుమ పల్లవలతాశ్రేణులు పూర్తిగద్యోతకము చేయుచున్నవి గదా?

ఇటలీశిల్పి:—దయా, సత్య, శౌచ, సుందరనిగూఢమగు రాణి హృదయము శారీరములను చలువరాలు సజీవముగ చాటుచున్నవిగదా!...?

గురుశిల్పి:—కావచ్చును...కాని యీ తాజమహలును నిజమగు చరిత్రకారులు క్షమింపలేని తప్పిదమొకటున్నది.

[వెనుకనుండి ఒక చిత్రకారుడు, ఒక కవి, ఒక చరిత్రకారుడు ప్రవేశము.]

చిత్రకారుడు:—లేదు, శిల్పిలేదు! సభ్య విమర్శకా సమాజములో ఒక మహాచిత్రకారుడనని పేర్వడసిన నేను యీ కళామయ శిల్పమూర్తిని యథాతథముగ చిత్రించుకొన లేకున్నాను. ఏకాగ్రత, సృష్టి స్ఫురణ, రంగుల విశేషణములు కూలంకషముగ యెరిగిన నా చిత్రకళాప్రతిభ యీ తాజమహల్ శిల్పవిశిష్టతి క్రీడురాకున్నది. ప్రపంచ మెరిగిన అన్ని చిత్రరచనా విధానములలోనూ, అన్నిరంగులతోనూ ఎంతో కాలము దీనికి సరియగు నమూనాను చిత్రింప పాటుపడుచున్నాను. నేటికి, తాజిపరిమాణాకృతుల యథాతథముగ చిత్రింప గలిగితిని, అది సజీవముగ కన్పించునట్లు దిద్దితిని. కాని; తాజిని చూచినంతనే మనము పొందుచున్న చల్లని వాతావరణపు చక్కిలిగింతలు చిత్రించుట నావశమగుటలేదు. ఎంతో కాలము శ్రమపడియు నిది సాధ్యము కానందుననే మా గురువు వికలమనస్కుడై యడవుల బట్టి పిచ్చివాడై తిరుగుచున్నాడు.— నేనును నాజీవిత సర్వస్వమును యీ కొరత పూరించుటకై వెచ్చింప జూచుచున్నాను. కాని: అయ్యది అలభ్యమని నమ్ముచున్నాను....ఇంకను నీరు తాజమహల్లో ఏదో కొరతయున్నదన్న నేనూహింప జాలను.

గు.శిల్పి:—అవునవును! చిత్రకారుల దృష్టిలో తాజమహల్ పరిపూర్ణ కళామూర్తి గావచ్చును. కాని, నేలోపమున్నదనున దింకొక దృష్టిలో.

కవి:—చేమొప్పు కొనము! తన ప్రాణములకన్న మిన్నగ ప్రేమించిన సౌందర్య రాశియగు తన రాణి ముంతాజమహల్ చనిపోయినంతనే పాదుషా షాజహాన్ హృదయము దుర్భర విషాద పూరితమయ్యెను. పందొమ్మిదేడులు తన హృదయేశ్వరియై నిక్కంపు స్నేహితురాలై మెలంగిన మహాసౌందర్యవతి తన కింక లేదని తలచిన పాదుషా మనసు వికావికలై నైరాశ్య విచార తుఫానుల పాల్పడెను. తానింకను ఆమెను ప్రేమించుచున్నాడు, ఆమె ప్రవర్తన వలపుల స్మరించి హృదయమున క్రుంకుకొనుచున్నాడు. ఆమె ప్రేమ శృంగారముల నన్యసామాన్యములని యెరింగినాడు తన ప్రేమా దుఃఖమూ అపారములు తమ పవిత్రప్రేమ ప్రపంచమునకే ఆదర్శప్రాయమని నమ్మినాడు. దానిని యుగయుగముల ప్రాపంచికులకూ అందజేయ నిచ్ఛ

గించినాడు. ఆయమ సౌందర్య స్మృతి చిహ్నము తన దాపులనున్నచో తన దుఃఖముపశమించు ననుకున్నాడు. కాబట్టి ఆయమ సౌందర్యమును, వారిరువురి ప్రేమను మరువుగ నుగ్గడించు స్మృతి చిహ్నమేర్పరుప తహంతహ లాడినాడు. వారి మతాను గుణ్యముగ గోరీయు వసరమైనది. దాని తలచినపుడే షాజహాన్ ఆగోరీనే పై విషయముల ద్యోతకము చేయు అనన్య శిల్పమూర్తిగ నిర్మించ నిశ్చయించినాడు. నానాదేశ ప్రసిద్ధ శిల్పుల రావించి కోటానంత ధనము వెచ్చించి యీ తాజమహల్‌ను నిర్మించినాడు. ఉద్దేశింపబడిన యర్థముల నన్నింటినీ ప్రతిఫలించు నీ శిల్పమూర్తిలో యింకనూ లోపమున్నదన్నమే నొప్పుకొనము !!

గు॥ శిల్పి:— అంతియగాదు; — ఏండ్లు మీరినను, బహుగ్రీష్మముల భరించినను యిసుమంతయూ వసివాడని ముంతాజ్ బేగం సౌందర్యమునను దీటుగనుండునట్లే యీ తాజ్ మహల్ సిద్ధహస్తులగు శిల్పులచే యుగయుగాలకూ మాయని నవ్యసౌందర్యముతో నిర్మింపబడినదని నేనొప్పుకొందును ... కాని, యుగయుగాల ప్రజలీ చిహ్నమును పరిచయము చేసికొని ఏ యే భావముల నొందుదురు ?... నేటి విషయముల రేపటి పౌరులకందించు చరిత్రకారులు ఈతాజి చరిత్రలో మీరెప్పుడు నుడివినంతకంటె మరేవిధయమైన లిఖించిరా? ...అయిన, రేపటి చరిత్రకారులు యీచరిత్ర నేమని విమర్శింతురో మీరొక్కసారయిన నూహించితిరా !

కవి:— నిర్మాత యాదర్శములన్నియు నీస్మృతి చిహ్నమున ప్రతిఫలించుచున్నవి, ప్రపంచమున యొనలేని శిల్పకళామూర్తియై దేశవిదేశముల జోతలందుచున్నది. చూపరుల పులకాంకితులజేసి మనముల మురిపించుచున్నది — తన దర్శనమాత్రాన తన చరిత్రనొసగి పథిక ప్రేమపటుత్వమును వెల్లడించుచున్నది. ఏ చరిత్రకారుడైనను యింతకంటె తక్కువగ తాజమహల్ చరిత్రలో వ్రాయుటకేముగదా ? ఇకను విమర్శకు తావేది !

గు॥ శిల్పి:— అవును ! అంతకంటె ఎక్కువ మీరాలోచించరు. కళాదృష్టిలో సఫలమయినది నిస్సంశయముగ నిజము ?... తాజమహల్ వెనుక నొక

స్మృతిశిల్పము చేయించ నూహించినది షాజహాన్. కాని, దాని యాకృతి నూహించినదెవరు ? ఆమాదిరి తాజ్‌ను సృష్టించిన దెవరు ? అనేకులు శిల్పులు తయారించి పూర్తిచేయగలిగిన యీతాజ్‌మహల్ మాదిరిని మొదట నూహించి సృష్టించిన శిల్పిఘనుడెవడగునా, కాదా ? ఆ మహాశిల్పి లేనిదే అసలిట్టి తాజమహల్ వుండదుగదా ! మరి ఆయన చరిత్రను, కనీసమాయన పేరును తెలియజేయు హంశము లేవైన యీతాజ్ నందున్నవా ! ఆతనిచే సృష్టింపబడి ఆతనినే విస్మరించిన యీసృష్టి కృతఘ్ను యగునా, కాదా ? కృతఘ్నత క్షమింపరాని యపరాధముగదా ? ?

కవి:—అవునవును ! కాని; తాను సృష్టించినపుడే తన స్మృతి నొకదాని నందేల పొందుపరుపలేదా శిల్పిబ్రహ్మ ?

గురుశిల్పి:—కళాకారులల్ప సంతోషులు. పాదుషా యభిమతము నుద్దీపించు చిహ్నమే ఆతడు సృష్టించినాడు మీరు తొలుత చర్చించి నతివరకే దీని పరమావధి యనుకొన్నాడు పాదుషా యాజ్ఞలమేరకే సృష్టించి ఆయనిచ్చిన ప్రతిఫలమున తృప్తిపడిన అసూయక నిస్వార్థుడగుట వలననే ఆ శిల్పబ్రహ్మ చరిత్రలేనివాడయినాడు.

కవి:—అయిన.—సమకాలిక చరిత్రకారులయినను తాజమహల్ చరిత్రతో ఆయా శిల్పులచరిత్ర లేల వ్రాయలేదు ?

గురుశిల్పి:—నాటి చరిత్రకారులు పాదుషా బానిసలు పాదుషా కొలువున నుండి, పాదుషాయిచ్చు జీతములకై తమ హృదయములే అమ్ముకుని, ఆత్మవంచకులై, ఆయన నుడివిన వాక్యములుదక్క మరొండు వ్రాయలేరు అధికార ధన కళాంధుడగు షాజహాన్ గూడను, తన ప్రేయసినిదక్క యితరుల తాజ్ విషయమున పేర్కొనలేదు ... ఈతాజమహల్ నిర్మాణమునకై ఎందరో శిల్పులము దేశదేశముల నుండి యిచటికివచ్చి ముప్పది మూడేడులకు పైగాస్వబంధు మిత్ర గృహ దేశములను సవి యెరుగుగక, ప్రతిక్షణమూ దీని సృష్టిలోనే నిమగ్నులమై, అనేక భౌతిక మానసిక కష్ట నష్టములకు లోనయినందులకు ప్రతిఫలముగ కొంత ధనమును పొందితిమి. పాదుషాకాలు గడల్పక పోయిన కూర్చున్నాడంత కాలమును. కాని; తాజ్

నిర్మాత—షాజహానని యే ప్రపంచము గుర్తించుచున్నది. తన్నిజ నిర్మాతలలో ఒక్కరి స్మృతియు యీ జగాన లేదు. మనచే సృష్టింప బడి మనలనెప్పుడునూ స్మరింపని యీ తాజమహాలు దండనార్హ కదూ? ...షాజహాను యిచ్చినది మన ముప్పదిమూడేండ్ల పరిశ్రమకు కూలిగా సరిపోవచ్చును. కాని....మనలో ఎందరు యీ తాజ్ నిర్మాణమున వికలాంగులు కాలేదు? ఎందరు తమ స్వదేశముల మరణించిన, పలు బాధలందిన బిడ్డల, భార్యల, మిత్రుల, పితరుల అంతిమ సందర్శ నములులేక తమ జీవితకాలమంతయు దుఃఖించి కృశించిపోలేదు? అనేకు లీశిల్ప నిర్మాణసమయమున రాలకుడ్యముల ఆఘాతములకు మరణించిరిగదా? వీటికేమైన ప్రతిఫలము గిట్టినదా? యింతలేసి కష్ట నష్టములకు తలొగ్గి మన మీ తాజమహాలును నిర్మించిన దెందులకు? మన శిల్ప సృష్టిచతురతజూపి ప్రాపంచికుల మెప్పుపడయుటకు కదూ? అయిన; నాడు షాజహాను నిండుసభలో మనల ధనమున సమ్మానించుటకన్న మనముపొందిన గౌరవమేది? తాజ్‌ను మెచ్చు చూపరులు షాజహాన్ ముంతాజ్‌లకన్న మరొకరిని గుర్తించి మెచ్చుకొనుచున్నారా?...లేదు లేదు. మరి, నిజమగు సృష్టికర్తల మయిన మనయెడల నీ తాజమహల్ ద్రోహియగునా కాదా? తప్పక యిది ద్రోహి; కృతఘ్నురాలు. దీనిని మనము దండింపవలసినదే.

చరిత్రకారుడు:—ఆగుమాగుము! తాజమహల్ తప్పక మీయెడల కృతఘ్ను రాలే. కాని, దీని దండించిన కలుగు లాభమేమి?

గురుశిల్పి:—ఇప్పుడీ తాజ్‌ను ధ్వంసముచేసి దండించినచో లోకము కారణ మునకై వెదకును, ప్రశ్నించును. ఏమి, ఎవరిని?? చరిత్రను, చరిత్ర కారులను, విమర్శకులను...నీ వొక చరిత్ర కారుడవు. దీని ధ్వంస కారణములు స్వవితర్కము వలన యూహింపగలవు. ప్రాయు మింక. ప్రపంచమునకు సరియగు జవాబిమ్ము. ఇకముందు ప్రపంచము లోని ఏ విషయమయినను—మూల కారణ సృష్టికారులని విస్మరించి నచో యిప్పుడు తాజమహల్ పొల్పడు దండనకే ఆ యా విషయ ములు గురికావలసి వచ్చునని చాటుము. ప్రపంచ మిక యిట్టి కృత ఘ్నుల క్షమించరాదు.

చరిత్రకారుడు:—అపరిమితావేశమున మీలో విమర్శనా శక్తి యొక్క వైపున నశించినది స్వవితర్కమున దూరాలోచన చేయుడు...... మీ సృష్టిని మీరే ధ్వంసము చేయుట—మీ బిడ్డల మీరే చంపుకొనునట్టి వెర్రి... తాజ్ మహలుకై షాజహాను కొన్ని కోట్ల రూప్యములు వెచ్చించినాడు ఆ ధనమంతయు ఆతడు ప్రజలనుండి శిస్తు రూపమున వసూలు చేసినదే అనగా ప్రజ తమ స్వేదరక్తముల వెచ్చించి సంపాదించి చెల్లించిన ధనమును పాదుషా ప్రజల సేమమునకే వెచ్చించుటకు మారుగ తన విలాసేచ్ఛగ దీనికై ఖర్చులు చేసినాడు. అందువల్ల షాజహాన్ అపూర్వశిల్ప కళాస్రష్టయను కీర్తియు, తన భార్యా స్మృతి చిహ్న సౌందర్య తృప్తిగర్వములు పొందగలిగినాడు ప్రజలు తమకు రావలసిన ప్రభుత్వపు కనీస దోహదములను గోల్పోయి నష్టాత్ములు అయినారు. పైగ షాజహాన్ తదుపరి పాదుషా యయిన ఔరంగజేబు తనతండ్రి వట్టిజేసిన ప్రభుత్వ ధనాగారమును నింపుటకై ప్రజలపై నెక్కుడు నూతన శిస్తుల వాత్తేసినాడు. ఎందుననూ ప్రజలే బహుగా నష్టపడినారు. ప్రజారక్త స్వేదములతో యేర్పరుప బడిన యీ తాజమహల్‌ను ధ్వంసము చేయుట మంచిది కాదు ఈ తాజమహల్ చరిత్రను జూచి ప్రజలు తమ పూర్వీకుల రక్తస్వేదములకారణముగ వెచ్చింపబడిన క్రూరమూర్తిగా దీని గ్రహింప వలయును. తాజమహల్ శిల్పకళా దృష్ట్యా చాలా గొప్పదగునది మన మందరమూ వప్పుకొనుచున్నాము. దీనిని భద్రముగా నుంచుట వలన కళా సౌందర్య విశిష్టతలనైనను ప్రపంచము తాజ్ నుండి గ్రహించి తృప్తిపడగలదు. అసలు తాజమహల్ సృష్టింపబడకయే యుండవలసినది; కాని కళాంగ సుందరముగ పూర్తిచేయబడిన తదుపరి దాని చెరుపుట, విచారించుట అవివేకము.

కవి:—దీని నిర్మాణమూలముననే అనేకులు శిల్పులు ఏండ్లతరబడి పోషింపబడిరి. దీని మూలముననే శిల్పుల సంపూర్ణ చాతుర్యము వెల్లివిరిసి యిలా ప్రస్ఫుటించి ప్రపంచమునకు లభ్యమయినది. షాజహాను తాజమహల్ నిర్మాణము చేయకున్న మన శిల్పులకు, భారతదేశమునకూ యీ ఘనతకీర్తి లేకుండెడిదిగదా!

చరిత్రకారుడు:—ఇది సముచితమగు భేషజము సుమా!...తాజమహల్ నిర్మాణమునకై వెచ్చించిన ధనమును ప్రజోపయోగకరములగు రోడ్లు, జలాశయములు, విద్య వైద్యములకై, వెచ్చించి యున్నచో ఆముప్పది మూరేండ్లు పోషింపబడిన శ్రామికులకంటె ఎన్నోవేల రెట్లు పనివాండ్రను కలకాలము పోషించ వీలుండెడిది...అసలు; మన చరిత్రయే యిప్పుడున్న శోచనీయ నిద్రాణస్థితిలోగాక సాటి దేశముల కీడగు విజ్ఞాన నాగరికవంతమై, ప్రజాక్షేమంకరమై, శోభావంతముగ నుండెడిది ...తాజమహల్ గొప్పదైనంత మాత్రమున మనకు వచ్చిన ఘనతయేమిటి? కీర్తియా? మానవ కనీసకాంక్షలగు తిండి, బట్ట, గృహము, విజ్ఞానములు చాలినంతలేని మనకు కీర్తియేమైన మేలు చేయగలదా? మన పూర్వీకుల శిల్పకళా విశిష్టత, దక్షత మేటివైనంతమాత్రమున ప్రాపంచిక సభ్యతలో నేడు మన దేశమున్న కనిష్ట శోచనీయస్థానపు కించతీరునా?...నవకవీ! బాగుగ యాలోచింపుము. మనకు కావలసినది తాజమహల్ కాదు; ప్రజానీకపు జీవితమును శాంతిసుఖ విజ్ఞానమయము జేయుటయె మన పరమావధి. నీలేఖిని నిక నీచేత పరిస్థితుల మహత్వమునకై వినియోగింపుము ప్రభుత్వ ఖజానాలోని ప్రతపైసయు ప్రజలకొరకే యిట్లే వెచ్చింపబడవలెననియు! ప్రతి చిహ్నమునను నిజమగు శ్రామికులు, సృష్టికారుల చరిత్రలు ప్రతిఫలింప వలయుననియు, చరిత్ర సర్వ విషయ విధానములకూలంకషముగ లిఖింపబడవలె ననియు; లేనినాడు నేటి యుగపు శిల్పివరులైన శ్రామికులు తిరుగుబాటు చేసి సృష్టినే విచ్ఛిత్తి చేయగలరనియు ప్రపంచమునకు చాటుము. ఇది మన పరమావధి.

కవి:—తథాస్తు—తథాస్తు.



నలందా ప్రెస్, తెనాలి. జి 93 - కాపీలు 950 - ది 31-12-46